# OSMANIA MAGAZINE

## ( TELUGU SECTION )

# శోభ




APRIL 1950

Vol. I

Nos. 1 & 2

# సంచికా సమితి
## 1950

అధ్యక్షుడు:

నవాబ్ అలీయావర్జంగు బహాదుర్, బి. ఏ. (ఆనర్సు), విశ్వవిద్యాలయోపాధ్యక్షులు.

ఉపాధ్యక్షుడు:

శ్రీ ఎం. ఎస్. దొరైస్వామి, బి. ఏ. (ఆనర్సు), ఎం. ఏ., ఎల్. టి. (మద్రాసు), కళాశాఖాధిపతి, ఆంగ్ల శాఖాధ్యక్షులు.

గౌరవ కోశాధిపతి

శ్రీ మహమ్మద్ బిన్ ఉమర్, ఎం. ఏ., ఆంగ్లోపన్యాసకులు.

ఇతవరి, ఆంగ్ల విభాగము:

శ్రీ కె. ఆర్. చంద్రశేఖరన్, ఎం. ఏ. ఆంగ్లోపన్యాసకులు.

ఇతవరి, ఉర్దూ హిందూస్తానీ విభాగములు

శ్రీ అబ్దుల్ ఖాదర్ సర్వరీ, ఎం. ఏ., ఎల్ ఎల్. బి. (ఉస్మానియా) ఉర్దూశాఖాధ్యక్షు

ఇతవరి, తెలుగు విభాగము:

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం. ఏ., ఆంధ్ర శాఖాధ్యక్షులు

ఇతవరి, కన్నడ విభాగము

శ్రీ డి. కె. భీమసేనరావు, ఎం. ఏ., కన్నడ శాఖాధ్యక్షులు.

ఇతవరి, మరాఠి విభాగము

శ్రీ ఆర్. ఎం., భూసారి, ఎం. ఏ., మరాఠి శాఖాధ్యక్షులు.

ఇతవరి, హిందీ విభాగము.

శ్రీ పండిత వంశీధర విద్యాలంకార్.

గౌరవ కార్యదర్శి.

ఎం. ఏ. హకీమ్ తిమ్మాపూరి, బి. ఏ. (ఆనర్సు) ఎల్. ఎల్. బి. పత్రికమ వ్యవస్థాపక సంపాదకుడు, ఆంగ్ల విభాగ సంపాదకుడు

సంపాదకవర్గ ప్రతినిధులు:

సర్దార్ అలీ ఇస్లామ్, బి. ఏ. (ద్వితీయ) ఉర్దూవిభాగ సంపాదకుడు.

రామానుజదాసు, బి. కాం. (ద్వితీయ) హిందూస్తానీ విభాగ సంపాదకుడు.

" దేశభాషలందు తెలుఁగు లెస్స "

# శోభ

ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థుల

## త్రైమాసిక సంచిక



ఆదరువు :

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు, ఎం. ఏ.

ఆంధ్ర శాఖాధ్యక్షులు.

సంపాదకుఁడు :

ఓం. రఘునాథరాజు, బి. ఏ. (ద్వితీయ)

సహాయ సంపాదకులు :

జె. జోగారావు, ఎం· ఎస్· సి· (ద్వితీయ)

వి. రామకృష్ణారావు , బి· ఏ· (ద్వితీయ)


సంపుటి ౧ ] [ సంచిక ౧, ౨

వికృతి-చైత్రము, ఏప్రిల్ 1950.

# విషయసూచిక







# శోభకు సందేశము

శ్రీయుత ఖండవల్లి లక్ష్మీరంజనముగారు,
ఆంధ్రోపన్యాసకులు.

శోభన్ శైశవలీల తల్లి యొడిలోఁ జూపించి, సద్రీతు లె
ల్లన్ భాషింపఁగ నేర్పి నేఁడు తరితో నుస్మానియా ధాత్రి సం
ఖ్యాభాస్వద్రచనావళీ గ్రథిత కావ్యంబందుఁ గాలూఁది నీ
శోభావాగ్వైభవంబుఁ జూపఁ జనుమా! శోభా! యనుంగుం జెలీ!

నేల నాల్గెరఁగుల నిఖిల విద్యాప్రౌఢి
నచ్చువెన్నెల గాయు నాంగ్లభాష
తులసి కబీరు మృదురసనాంచలశిని
వ్యంజిత రుచులూరు హిందీ భాష
జ్ఞానదేవస్వామి నామ తుకారాము
రాజితాభంగ మరాఠిభాష
వేంగి దత్తసుతులు, విఖ్యాతులౌ పంప
పొన్న కవీంద్రుల కన్నడనుడి
లలిత శృంగార పదముల మొలచు నసుము
భారతీదేవి యూర్ధ్వాని భంగిఁ దోఁచె
మాత్రాల్ల శోభాకనత్వ మొలఁగెనమ్మ
వాణి నివాస రాష్ట్రమై వరలుగాత!

నన్నయభట్ట ప్రసన్న కథాయుక్తి
యక్షర రమ్యత యెఱ్ఱనీంద్రు;
తిక్కనామాత్యుఁడు తెలుఁగువారికిఁ గూర్చి
కనిపెట్టి కలలు నీకలము సాక్షి,
హరి నామ కావ్యంబు వరసరోవరమన్న
పోతయ్య చరితంబు పుణ్య సాక్షి;
రాజగద్దియనుండి రహి పేదల నరయు
కృష్ణరాయలు నీకు క్రియకు సాక్షి;
నూతనాలోక రుచులకు జ్యోతులెత్తి
ముందు నడకలు నడువఁగ మూర్తమంచు
పలుకు వీరేశలింగము ప్రగతి సాక్షి;
శంక లేలమ్మ దిట్టవై సాగుమమ్మ!

# శుభ సందేశములు

## రాష్ట్రపతి పట్టాభి సీతారామయ్య పంతులుగారు.

NEW DELHI
19, Canning Lane,
13—3—50

మిత్రమా,

మీ 13 వ తేది ఉత్తరం అందినది. ఉస్మానియా విశ్వ విద్యాలయము పక్షమున తెలుగులో 'శోభ' యను పత్రిక వెలువడుచున్నందుకు చాల సంతోషము. ఒక సంచిక చూచిన తరువాత నా అభిప్రాయం పంపగలను.

చిత్తగించవలెను
(Sd). పట్టాభి సీతారామయ్య.

---

## ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు.

ఉస్మానియా విశ్వ విద్యాలయములోని ఆంధ్ర విద్యార్థుల పక్షమున సంవత్సరమునకు మూడు తెలుగుసంచికలు ప్రకటించు సంకల్పముతో ఇప్పుడు వెలువడుచున్నది మొదటి సంచిక. ఇంతకు పూర్వము, ౫, ౬ సంవత్సరములనుండి ఒక లిఖిత మాసపత్రిక 'శోభ' అనుపేర వీరివలన వెలువరచబడు చుండెననియు, అట్టి మాసపత్రికలోని కొన్ని వ్యాసములలో అనేక గద్య పద్యాత్మక రచనలు చేర్చి ఈ మొదటిసంచిక ప్రకటించబడు చున్నదనియు తెలిసినది. ఇది సంతోషప్రదము. రచనలలో గ్రాంథికభాషకు ప్రాధాన్యత ఇయ్యబడుట సమంజసముగా నున్నది.

ఈ సత్ప్రయత్నము ప్రథమమే యైనను సర్వవిధముల ప్రశంసనీయమును, ప్రోత్సాహదాయకమును నై యున్నది. నేను విద్యార్థి సోదరుల ఈ సాహిత్యక్షేత్రకృషి నభినందించుచు నిది ఫలదాయక మగునట్లు అనుగ్రహించ పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

౨—౮—౧౯౫౦,
ఆంధ్రకుటీరము,
హైదరాబాదు.

(Sd). మాడపాటి హనుమంతరావు.

---

## కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు.

బెజవాడ,
20-3-50.

To
Mr.
Om. Raghunath

నాకు తీరికలేక వ్రాయలేదు. మీ శోభకు జయమగుగాక! ఇవి శుభదినములు. మీ విశ్వ విద్యాలయములో తెలుగుభాష నూత్న స్వాతంత్ర్యముతోపాటు వృద్ధి పొందుగాక! ఆశీస్సులు.

(Sd). విశ్వనాథ సత్యనారాయణ.

# సంపాదకీయము

వర్షాకాల మారంభించినప్పుడు మహాటోపముతోఁ బొంగుచుఁ బొరలుచు బయలు దేరి వచ్చు వర్షజలముచే ప్రశాంతముగాఁ బ్రవహించుచుఁ బోవుచున్న నిర్మల నదీప్రవాహములు కలుషితములై మహా సంచలనమునకు గుఱియగును. కాని కొంతకాలము గడచిన తర్వాత మఱల ఆ జల ప్రవాహములు నిర్మలములై, ప్రశాంత గమనము కలవై, యనుకూల పరిణామమును గాంచును. ఇట్లే కాల ప్రవాహము కూడ. అప్పుడప్పు డదికూడ కల్లోలములకు గుఱియైనను అదుపులోనికి వచ్చుట కంతో సేపు పట్టదు. అదియును నిత్య నూతన పరిణామముల నందుచునే యుండును. వాస్తవముగా పరిణామమే జీవనము. పరిణామ రహితమైనది మృత తుల్యమే. పరిణామము వలనఁ దాత్కాలికముగాఁ గొన్ని యననుకూలములు లేర్పడి నను దర్వాత తర్వాత దానివలన నెన్నియేనియు లాభములు చేకూరును.

మన సంస్థానములోఁ గూడ కొంతకాలము క్రిందట ఈ పరిస్థితియే యేర్పడి నది. కాని కాల ప్రవాహమున ఆ ప్రతికూలశక్తు లన్నియును గొట్టుకొని పోయి నవి. ప్రస్తుతము మనము రాజకీయ రంగమున కొంతవఱకు నిశ్చింతావాయువులనే పీల్చుచున్నాము. మన సంస్థానములో రాజకీయము, సాంఘికము, ఆర్థికము— అది యిది యననేమి, ప్రతిరంగము నందును గణనీయములైన పరిణామములు జరిగినవి. వాని నన్నిటిని నటుండనిండు. మన విశ్వ విద్యాలయ విధానము నందును ఎన్నియో మార్పులు గావింపఁబడినవి. వానిలో ముఖ్యాతి ముఖ్యమైనది, ప్రాంతీయ భాషలకు ఆదరము— అప్పుడే అంత పెద్ద శబ్దము నుపయోగించుట అతిశయోక్తియే!— కనీసము అభివృద్ధి కవకాశము లైనను గల్పింపఁ బడినవని చెప్పవచ్చును. దీనికి రెండు ఉదాహరణములు: మొదటిది ప్రతి విద్యార్థికిని వారి యొక్క ప్రాంతీయ భాషను నిర్బంధ పఠనీయము— కొంతవఱకే సుమండీ!— గావించుట. రెండవది, విశ్వవిద్యాలయ సంచికలో ప్రాంతీయభాష లన్నింటికిని స్థానమిచ్చుట. మన కేది కావలసినదో, దేనికొఱకై చిరకాలమునుండి తహతహ పడుచుంటిమో అది లభించినది. దానిని సద్వినియోగ పఱచికొని మన సమర్థతను జాటుట మన విధియై యున్నది.

## 'శోభ'

గడచిన అయిదారు సంవత్సరములనుండి మన యాంధ్ర విద్యార్థి సంఘ యాజమాన్యమున 'శోభ' యను పేరుతో నొక లిఖిత మాసపత్రిక వెలువడుచు

వచ్చుచున్నది. ముఖ్యముగా గౌతమరావుగారి సంపాదకత్వమున ఈ సంచిక యెంతయు గౌరవస్థానము నాక్రమించినది. అప్పుడే వారు దానిని మునిద్రింపించు ప్రయత్నములు చేసియుండిరి. కాని వారా ప్రయత్నమునఁ గృతకృత్యులు కాఁజాలకపోయిరి. వారు తమ వార్షిక సంచికలో సంపాదకీయము వ్రాయుచు "మనము మన పనిని చక్కఁగా నిర్వహించితిమని గర్వించుట తగదు. దీని భవిష్యత్తు ఎట్లున్నదో? దీని భవిష్యత్తును ఉజ్జ్వలముగాఁ జేయుట మన వారసుల కర్తవ్యమై యున్నది. వారు వారి కర్తవ్యమును శక్తివంచన లేకుండ నిర్వహింతురనియే యాశింతముగాక" అని వ్రాసినారు. చూడుఁడు! వారి కెంతటి కర్తవ్యదీక్ష యుండెనో! మనముకూడ నట్టి కర్తవ్యదీక్షతోనే పని చేసి వారి కీర్తిని దీపింపఁజేసి వారసుల మని నిరూపించుకొను బాధ్యత మనపై నున్నది.

ఈ సంవత్సరమునుండి శాశ్వతముగా తెలుగుభాషలోఁగూడ సంచిక బయలుదేరుట కిట్టి కార్యములు కల్పింపఁ బడినందులకు పలువురు విద్యార్థులు తమ సంపూర్ణోత్సాహమును బ్రకటించినారు. వారు తమతమ యమూల్య రచనము లనేకములుగాఁ బంపి ఉస్మానియా విశ్వవిద్యాలయమునందును పలువురు యువకాంధ్ర రచయిత లున్నారని నిరూపించినారు. కాని సమయస్థలాభావములచేత వాని నన్నిటిని బ్రకటింపలేక పోయినాము. దీనివలన వారు నిరుత్సాహపడక ఆగామిసంచికకై మఱింత యుత్తమ రచనలను బంపుదురని యాశించుచున్నాము.

ఇఁక ఈ సంచికలోని భాషను గుఱించి కొంత మనవి చేసికొనవలసియున్నది. ఇందులో మేము సాధ్యమైనంతవఱకు గ్రాంథికభాషకే ప్రాధాన్య మిచ్చినాము. కనీసము విద్యాలయములైనను సలక్షణమైన యాంధ్రభాషను బోధింపవలెననియు, విద్యార్థులైనను దీని నభ్యాసము చేసికొనవలెననియు మా యుద్దేశము. దీనిని విద్యార్థి సోదరులుగూడ సంపూర్ణముగా నామోదింతురనియే మా విశ్వాసము. గత సంచికలోఁగూడ చాలవఱకు గ్రాంథికభాషయే యుపయోగింపఁ బడినది.

ఆంధ్ర విద్యార్థి సంఘము :

కేవలము ప్రాంతీయ భాషాసంఘము లనఁగా తెలుఁగు, మరాఠీ, కన్నడ సంఘములలోఁ దప్ప మన విశ్వవిద్యాలయములోఁ బనిచేయుచున్న యన్ని సంఘములలోను విద్యార్థియే యధ్యక్షపదవిని నిర్వహించుచున్నాఁడు. వీనిలోఁగూడ విద్యార్థులే యధ్యక్షులుగా నుండుటను, ఇప్పుడిప్పుడే అధికార వర్గములవారు ఆమోదించినట్లు తెలియుచున్నది. రాబోవు సంవత్సరమునందు విద్యార్థియే అధ్యక్షుఁడుగా నియమింపఁ బడఁగలఁడని యాశింపవచ్చును.

ఈ సంవత్సరము మన ఆంధ్ర విద్యార్థి సంఘమునకై క్రొత్తయెన్నికలు జరిగి నాలుగు మాసములు గడచిపోయినను నూతన కార్యక్రమము అమలులోనికి

రాలేదు. విద్యార్థి సోదరులును దీనియందు శ్రద్ధ చూపుటలేదు. మును ముందైనను కార్య నిర్వాహకులును, విద్యార్థి సోదరులును పరస్పర సహకార భావముతోను శ్రద్ధతోను కార్యక్రమమును నిర్వహించి మన ప్రతిష్ఠను నిలుపుకొందురు గాక!

### మాతృభాషలో విద్యాబోధనము :

సంవత్సరము దాటిపోయినది. మన విశ్వ విద్యాలయోపాధ్యక్షులు నవాబ్ అలీయావర్జంగు బహాద్దురుగారు వరంగల్లు, ఔరంగాబాదు, గుల్బర్గా కళాశాలలలో ప్రాంతీయభాషలు అనఁగా తెలుఁగు, మరాఠీ, కన్నడ భాషలు మాధ్యమములుగా విద్యాబోధనము జరుగు ఏర్పాటులు చేయుఁబడఁగలవని ప్రకటించినారు. ఇది యెంతయును శ్లాఘనీయమైన విషయము. వారి యీ సదుద్దేశము కార్యరూపము నొందు శుభదినమునకై మేము వేయికన్నులతోఁ బ్రతీక్షించు చుండఁగలము.

### ధన్యవాదములు :

మాతో సహకరించిన విద్యార్థి సోదరులకును, తమ అమూల్యరచన లిచ్చిన ఆచార్యవర్యులకును, శుభసందేశము లంపించిన పెద్దలకును మా కృతజ్ఞతాభివందనములు.



# బాష్పాంజలి



ఆంధ్ర సాహిత్యములో నొక నూతన యుగ నిర్మాతలైన బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి యంతర్ధానము మనకును, మన భాషకును తీరని నష్టమును గలిగించినది. వారు అటు సనాతనాభిమానులను, ఇటు నవ్యులను లేక అభ్యుదయ ప్రియులను ఒకేరీతిగా మెప్పించి యాదరమును గొన్న సార్వజనీన కవులు.

వారికి మా బాష్పాంజలి.



ఓంకారము రఘునాథరాజు, బి. ఏ.

ముఖ్యసంపాదకుడు

సంపాదక వర్గము



ఎడమ నుండి కుడికి:- (1) వి. రామకృష్ణారావు (ఉపసంపాదకుడు)
(2) ఓం. రఘునాథరాజు (ముఖ్యసంపాదకుడు) (3) శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు(ఇతవరి
(4) శ్రీగోపాలకృష్ణారావు (ఆంధ్రోపన్యాసకులు) (5) [illegible]గారావు (సహాయసంపాదకుడు)



భోగారావు, ఎం. ఎస్‌సి.

సహాయ సంపాదకుడు



కూర్చుండినవారు, ఎడమనుండి కుడికి:- (1) సూర్యప్రకాశరావు (కోశాధిపతి) (2) లక్ష్మీనరసింహారావు (సహాయకార్యదర్శి) (3) శ్రీఖండవల్లి లక్ష్మీరంజనంగారు (అధ్యక్షులు) (4) గోపాలకృష్ణారావుగారు (పూర్వఉపాధ్యక్షులు) (5) వెంకటనారాయణ (కార్యదర్శి)
నిలుచుండినవారు:- (1) లక్ష్మీనరసింహాచార్యులు (2) శ్యామసుందర్ (3) వి నరసింహారావు

# ఆంధ్ర విద్యార్థిసంఘ ప్రథమ వార్షిక నివేదిక

హైదరాబాదు స్వాతంత్ర్య సమరకాలములో మా సంఘము అజ్ఞాత వాసములో నుండినది. స్వాతంత్ర్యప్రాప్తి తోడనే ఈ సంఘము తన శక్తులన్నిటిని సేకరించుకొని కార్యమునకు గడంగినది.

కార్య నిర్వాహక వర్గము (౧౯౪౮—౧౯౪౯)

ఉపాధ్యక్షులు : శ్రీ మాటూరి నరసింహారావు
కార్యదర్శి : శ్రీ బి. వేంకటనారాయణరావు
సహాయకార్యదర్శి : శ్రీ టి. లక్ష్మీనరసింహారావు
కోశాధికారి : శ్రీ పి. సూర్యప్రకాశరావు

మఱికొందఱు తరగతివారి ప్రతినిధులు.

ప్రారంభోత్సవము :—

ది ౨౭-౧-౧౯౪౯ నాఁడు ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీనిరంజనంగారి యధ్యక్షతను సంఘ ప్రారంభోత్సవము జరిగెను. మ॥రా॥శ్రీ బూర్గుల రామకృష్ణారావు పంతులుగారు ప్రారంభోపన్యాసమును ప్రసాదించిరి. విశ్వ విద్యాలయోపాధ్యక్షులైన నవాబ్ అలీయావర్ జంగుగారును దయచేసి విద్యార్థులకు హితబోధ చేసిరి. శిరోమణి శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారు కూడ ఆంధ్ర సారస్వతమును గూర్చి యుపన్యసించిరి.

సభలు - సమావేశములు :

కార్య నిర్వాహక సభలు మొత్తము తొమ్మిది జరిగినవి. నిర్ణీతసంఖ్య సభ్యులు రాకపోవుటచే తఱచు ఇబ్బంది కలుగుచుండెడిది.

ఇంకను ఈ క్రింది సమావేశములు జరిగినవి.

(౧) ది 30-3-౪౯ ఉగాది సమావేశము :
అధ్యక్షులు : శ్రీ రావాడ సత్యనారాయణరావుగారు.
ఉపన్యాసకులు : డాక్టరు శ్రీ మామిడిపూడి... 

శ్రీ లక్ష్మీనిరంజనముగారును, శ్రీ దుర్గయ్యశాస్త్రిగారును కవితాగాన మొనర్చిరి.

(౨) ది ౨౭-౮-౪౯ నాఁడు ఆచార్య శ్రీమాన్ వేదాంతాచార్యులుగారు "పాశ్చాత్య దేశములలోని విద్యా విధానము" పై నుపన్యసించిరి.

(౩) ది ౨౯-౮-౪౯ నాఁడు "భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణము దేశమునకు అవసరమా? అనవసరమా?" విద్యార్థుల చర్చాసభ.

(౪) ది ౧౯-౯-౪౯ నాఁడు డాక్టర్ శ్రీ మారేమండ రామారావుగారి ఉపన్యాసము : "ఆంధ్రరాష్ట్రము - అర్హత".

(౫) ది ౨-౧౦-౪౯ నాఁడు శ్రీ లక్ష్మీరంజనంగారి అధ్యక్షతను 'గాంధీ జయంతి'

కార్యదర్శి,

జి. వేంకటనారాయణరావు.

# వార్షిక సారస్వతోత్సవములు

పై సంఘము నవంబరు ౧౯-౨౦ తేదీలలో వార్షిక సారస్వతోత్సవములను మహాఘనముగ జరిపినది. మొదటిరోజు శ్రీ వేపా కృష్ణమూర్తిగారు (పి. డబ్ల్యు. డి. కార్యదర్శి) అధ్యక్షత వహించిరి. ఆచార్య శ్రీ తణికెళ్ళ వీరభద్రుడు గారును, సీతారాం బాగ్ సంస్కృత పాఠశాలాచార్యులు శ్రీ కె. నరసింహ శాస్త్రిగారును, శ్రీమతి ఎల్లాప్రగడ సీతాకుమారి గారును ఉపన్యసించిరి. తర్వాత నాటక ప్రదర్శనములు జరిగినవి. అందులో జోగారావు గారికిని, అప్పలాచార్యులు గారికిని ప్రథమ బహుమానములు లభించినవి.

రెండవరోజు శ్రీ ఇల్లిందల రామచంద్రరావుగారు (ఆర్థిక శాఖా కార్యదర్శి) అధ్యక్షత వహించిరి. వేదాంతాచార్యులవారును, డాక్టర్ ఆర్. వి. రావుగారును ఉపన్యసించిరి. శ్రీమతి భారతీ రత్నాకరాంబగారు "రుద్రమాంబ" గేయమును శ్రావ్యముగా వినిపించిరి. తరువాత శ్రీ గోపాలరాజుగారి భరతనాట్యమును, నాటక ప్రదర్శనము జరిగినవి. గోపాలరాజుగారికిని, రఘునాథరాజుగారికిని ప్రథమ బహుమానములు లభించినవి. తెలుఁగు సంఘము ఈ విజయమునకు అభినందనీయము.

అన్నిటికన్నను శ్లాఘనీయమైన విషయము : ఆంధ్ర దేశ తుఫాను నిధికై ఈ సంఘము నూరు రూపాయల విరాళమును పంపించి ధన్యమైనది.



# ధన్యవాదాలు

శ్రీ మ. శేషారావుగారు, బి. ఏ.

౧

పూర్ణ స్వాతంత్ర్యంబు పొందఁ గల్గితివమ్మ
నేఁడు స్వారాజ్యంబు నీ కబ్బెనోయమ్మ
దాస్య భావాలింక దరిఁ జేరావమ్మ
తల్లి భారతి నీకు ధన్యవాదాలమ్మ !

౨

పండు వెన్నెలఁబోలు నిండు నీ విభవంబు
చండభానునిఁ బోలఁ జాలు నీ శౌర్యంబు
దిక్కు దిక్కుల వెల్గి తీరునీ ధీశక్తి
తల్లి భారతి నీకు ధన్యవాదాలమ్మ !

౩

లోకమాన్యుని మహా లౌకిక త్యాగంబు
బాబూ సుభాసుని ప్రబల ప్రయత్నంబు
లాల లజపతి యొక్క లావు పోరాటంబు
గాంధీ తపస్వి యఖండ బలిదానంబు
నేఁడు ఫలియించె నీ దేశ కోరికలమ్మ
తల్లి భారతి నీకు ధన్యవాదాలమ్మ !

౪

సర్వ భ్రాతృత్వంబు సత్యం బహింసయు
శౌర్య శూరత్వంబు గాఢాభిమానంబు
కలిగి స్వాతంత్ర్యంబు నిలుపుకోఁ గలశక్తి
భారతీయుల మేము పడయఁగా వరమిమ్మ
తల్లి భారతి నీకు ధన్యవాదాలమ్మ !



# మాతృభాష నేల చదువవలెను?

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు, ఎం. ఏ., ఆంధ్రశాఖాధ్యక్షులు.

'మాతృదేవో భవ', 'పితృదేవో భవ' అనఁగా తల్లియే దైవముగాఁ గలవాఁడవు, దండ్రియే దైవముగాఁ గలవాఁడవు గమ్ము అని వైదిక ఋషులు అనుశాసించి యున్నారు. దీనికి కారణమును వారే మఱి యొకచోట నిట్లు వివరించి యున్నారు. 'మాతా పూర్వరూపమ్, పితోత్తర రూపమ్, ప్రజాసంధిః'. 'ప్రజనన క్రమము నందు తల్లి పూర్వరూపము, తండ్రి యుత్తర రూపము. సంతానమే వీరి నడుమ సంధి బంధము' అనియు ఋషులు ఉద్బోధించి యున్నారు. చను గుడుచునంత కాలమును బాలునకు తల్లియే లోకము. నడువనేర్చి యాటలకు మరగినవాఁడు తోడి పిల్లలను గూడి యా సాయంత్రము చరించియు రాత్రికైనను తల్లి యొడిచేరును. 'నూనూగు మీసాల నూత్న యౌవనము నందు' యువకుని నేత్రములు తనకు ప్రియురాలు కాఁదగిన స్త్రీరూపమును అన్వేషించుకొనుటలో నిమగ్నమై భ్రమించుచుండును. ఈ క్రొత్తలంకె ప్రాఁత లంకెను జిగి సడలించును. గృహస్థులయి తల్లిని మఱచిన వారును, తండ్రిమీఁద యాస్తికొఱకై వ్యాజ్యము వేయువారును గూడ లేకపోలేరు. కావుననే 'అడ్డాలనాఁడే బిడ్డలు కాని, గడ్డాలనాఁడు కాదు' అను సామెత పుట్టినది.

మానవునకుఁ దల్లిని ప్రేమించుట యెంత సహజమో, తల్లి దేశమును ప్రేమించుట కూడ నంత సహజమైనది. అది యాతనికి స్వధర్మముగఁ బరిగణింపఁ బడుచున్నది. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అన్నారు. మాత, మాతృభూమి, వీని వలెనే మాతృభాషయు మానవునకు అత్యంత సహజమును, అవశ్యాదరణీయమును అగుచున్నది. ఈ మూఁడును నాగరక మనుష్యుని పాలిఁటి 'ఆధ్యాత్మిక త్రికము' అని చెప్పినను అతిశయోక్తి కానేరదు. మనుష్యుఁడు ఐదు ఋణములతోఁ బుట్టి పెరుగుచున్నాఁడని పెద్దలు చెప్పుదురు. ఈ ఋణములను దీర్చుకొనుటకే పంచ యజ్ఞములను మనవారు విధించియున్నారు. బ్రహ్మయజ్ఞము, పితృయజ్ఞము, దేవయజ్ఞము, మనుష్యయజ్ఞము, భూతయజ్ఞము. అధ్యయనాధ్యాపనములు బ్రహ్మయజ్ఞము. తర్పణము పితృయజ్ఞము. హోమాది కర్మలు దేవయజ్ఞము. అతిథిపూజనము మనుష్యయజ్ఞము. భూతబలులు భూతయజ్ఞము. వీనిచే మనుష్యుఁడు ఆయా ఋణములఁ దీర్చుకొనునని మనవారి విధానము. వివాహము చేసికొని ధర్మసంతానమును బొందినఁగాని పితౄణము తీరదని కూడ ఆర్యులు తలంచిరి. ఈ పంచఋణ విధానమును మనమిప్పుడు గుర్తింపక

పోవచ్చును. ఋణపరిష్కార చట్టము (Debt Relief Act) క్రింద వానిని ఎగురవేసినను అడుగువారు లేరు. కాని ప్రాఁత అప్పుపత్రములను దిరుగ వ్రాసినట్లు పంచ ఋణములును, మఱియొక రూపములోఁ బ్రత్యక్షము లగుచున్నవి. అయినను అప్పులను ఈనాఁడు మనము మూఁడింటిని జేసికొనవచ్చును. ఏది ఈ ఋణత్రయము? 'మాత, మాతృ భాష-మాతృభూమి' ఇది క్రొత్త ఋణసంపుటి. ఋణదాత మిక్కిలి 'కంజూసు' వాఁడుగా నున్నాఁడు. ఇంతకు తగ్గననుచున్నాఁడు. ఎవఁడీ రక్తపిపాసువైన యప్పులవాఁడు. మన అంతరాత్మయే. ఎవఁడో క్రొత్తవాఁడు కాఁడు.

ఋణత్రయములో నడిమిదైన మాతృభాషా ఋణపరిష్కార మార్గమును జర్చింతము. మధ్యనున్నవాని గతి యధోగతి పాలు. భాస మహాకవి 'మధ్యమవ్యాయోగ' మనుపేర నొక చమత్కార నాటిక వ్రాసియున్నాఁడు. మానవుఁడు సహజముగా మాతృభాషను బ్రేమించును. దీని విషయమై యాతనిని ఉద్బోధింప నక్కఱ లేదు. కాని కులుకుల కొలికిదైన సాలంతి యొకామె చెయిఁ బట్టగనే వృద్ధమాతకు క్రమముగా దూరస్థుడైనట్లు సుసంపన్నములైన యన్యభాషల పరిచయము మేర్పడిన తరువాత మానవుఁడు తన మాతృభాషను ఉపేక్షించుటయో, విస్మరించుటయో చేయుచున్నాఁడు. ఆంధ్రులమైన మన మిప్పు డీ ప్రమాదములోఁ బడియున్నాము. తత్రాపి తెలంగాణమునందు మాతృభాష నుపేక్షించుట ఒక వీరకార్యమైనది. ప్రాచీనమైన మన యాంధ్రభాష అన్యభాషల కోడంట్రికముచే నొత్తుకు పోవుచున్నది. ఒకవంక విశ్వవ్యాప్తమైన యాంగ్లభాష; మఱియొకవంక యావద్భారత భాష నయినానని విజయడిండిమము కొట్టుకొనుచున్న హిందీభాష. ఓడలు బండ్లైనట్లు నిన్నటి వఱకును నేనే భారత భాష ననుకొని బొమ్మలు విఱుచుకొని నడచిన ఉర్దూభాష, తనజెండా దింపుకొనినదే యనుకొండు! 'ఉద్ధతుల నడుమ పేదలకుండఁ దరమె' యని కవి చమత్కరించినట్లు ఆంగ్ల హిందీ భాషల నడుమ పేదరాలు పెద్దమ్మ తెలుఁగు తల్లి నలిగి పోవు నవస్థ వచ్చినది. దుర్బల మనస్కులైన కొందఱు మూచి యేమియుఁ జేయలేక చేతులు పిసికికొనుచున్నారు. 'పరిస్థితులిట్లున్నవి, మనమేమి చేయగలము?' అని కొందఱు నిస్పృహులగుచున్నారు. పరిసరములను బరిస్థితులను తమ కనుకూలములుగఁ గల్పించుకొనువారు ధీరులో? లేక వానికి లొంగిపోయి నిజరూపమును గోల్పోవుటకు సమ్మతించువారు ధీరులో? వేరే చెప్ప నక్కఱలేదు.

భాషా సమస్యను గూర్చియు, దాని యనుబంధమగు భాషా ప్రయుక్తరాష్ట్ర విభజనమును గూర్చియు భారతదేశమునం దీనాఁడు వింతభావములు వినవచ్చుచున్నవి. "భారత దేశము క్రొత్తగా రాజకీయైక్యతను సాధించినది, దీని నెల్లవిధముల సంరక్షించుటయుఁ బోషించుటయు మనవిధి. భిన్న సంస్కృతులును, భిన్న భాషలును దేశములో వ్యాప్తియందున్నవి. ప్రజలు వీని నంటిపెట్టుకొని యున్నచో భారతీయైక్యతాభావమునకు దెబ్బతగులును. కావున ఈ భిన్నత్వమును మెల్లమెల్లఁగా బోఁగొట్టి, నిద్రింపఁజేసి, ఏకసంస్కృతి, ఏకభాషా సూత్రముపై భారతీయుల నందఱను బంధించుట యవసరము." ఈ రీతిని వాదించువారు

తలయెత్తుచున్నారు. వీరి దృష్టిలో ప్రాంతీయభాషాభిమానము దురభిమానము, సంకుచిత భావప్రేరితము. దీనికి వారు కల్పించిన క్రొత్త పేరు 'భాషాజాడ్యము' (Linguism), ఇవాళ ఈ అతివాద శిఖామణుల దృష్టిలో ఆంధ్రులు 'భాషాజాడ్య' పీడితులలో నగ్రేసరులు. ఏలన వీరు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమును వాంఛించు చున్నారు. తద్ద్వారా ఆంధ్రసంస్కృతికిని, ఆంధ్రభాషకును ఒక నూతనస్థాయిని, భవిష్యదుజ్జీవనమును నెలకొల్పఁ జూచుచున్నారు. నల్లమందు వేసికొని కుంభకర్ణ నిద్ర పోవలసిన వ్యక్తి మేల్కాంచి. మత్తువీడి, తిరిగి నడయాడుటా? యని వీరు విస్తుపోవుచున్నారు. ఆంధ్రులలోఁగూడ పై వాదమునకు 'డూ డూ బసవన్న' గారలు లేకపోలేదు. సముద్ర తరంగమువలె నాంధ్రుని కెప్పుడును ముందుముందుకుఁ బోవుట నైజము. ఇది మంచియుఁగావచ్చును, చెడ్డయుఁ గావచ్చును. ఆంగ్లభాషరాజ్యము చేసినవాఁడు దానిని శిరసా వహించుటకు తెలుఁగువాఁడు ముందు. హిందీభాష యూరేగుదు ననఁగానే బుజముకాసి పల్లకీ మోయుటకు తెలుఁగువాఁడు ముందు. ఆంధ్రుఁడు పల్లకీ మోఁతకే జన్మించెనా? పల్లకీలోఁ గూర్చుండుట కితనికి పట్టలేదా? యని శంకింపవలసి వచ్చుచున్నది.

అదృష్టవశమున భారత ప్రభుత్వము వారును, మహా నాయకులైన బాబు రాజేంద్రప్రసాదు, పట్టాభి సీతారామయ్య పంతులు, జవహరులాలు పండితుఁడు, సర్దారు పటేలు మున్నగువారు పైన పేర్కొన్న వితండవాదములోఁ జేరినవారు కారు. భారతీ యైకమత్యతను కాంక్షించువారే యైనను భిన్న భారత సంస్కృతులును, వాఙ్మయములును నిర్వీర్యములై నశింపవలెనను సంకుచిత భావము గలవారు కారీమహనీయులు. ఈ భాషలన్నియును మోసులెత్తి, చిగిర్చి, యాకు దొడిగి, పూచి, ఫలించి కన్నులపండువుగా నుండవలయు ననియే వీరి యాశయము. కొమ్మలు నఱికివేసి మాను మాత్రము పెంచఁదలఁచిన తోఁటమాలి యజ్ఞతను ఏమనవలెను? ఆయా ప్రాంతీయ భాషలు ఉన్నతవిద్యా విధానము నందును, రాష్ట్ర పరిపాలనము నందును, సంపూర్ణమైన అధిష్ఠానమును బొందవలయు ననునదియే భారతప్రభుత్వ నీతి. భారతప్రజా రాజ్యాంగమునకు మొదటి యధ్యక్షుఁడైన బాబు రాజేంద్రప్రసాదు ఈ యంశమును ముక్తకంఠముతో ఘోషించి మాననీయుఁ డగుచున్నాఁడు. విశ్వవిద్యాలయ విద్యా విధానమునుగూర్చి సమర్పింపఁబడిన నివేదికలో మాతృభాషా పఠనము 'ఇంటర్మీడియటు' తరగతిలో సమాప్తమగునట్లు సూచన గలదు. ఉన్నత విశ్వవిద్యాలయ తరగతులలో విద్యార్థి తన మాతృభాషను నిర్బంధముగఁ జదువ నక్కఱలేదని కమీషనువారి యుద్దేశమైనట్లు తోఁచును. ఈ సూచన ఆమోదింపఁదగినది కాదు. షష్టిపూర్తి నైన దేహమునకైనను అన్నపానీయములు నిత్యమెట్లవసరమో, విద్యార్థికిఁ బ్రతి దశయందును మాతృభాషా సంబంధ మంత యవసరము. ఇది యిట్లుండఁగా, 'అ ఆ'ల నాఁడే యాంధ్రభాషను విడిచిపెట్టిన ఉస్మానియా విద్యార్థులు మాతృభాషా పఠనము విషయమై మీనమేషములు లెక్కించు చున్నప్పుడు వారు మాతృభాషా ఋణమును దీర్చుకొన్న వారని యెట్లు చెప్పనగును?

# పూనా సైన్సు కాంగ్రెసు



జోగారావు యం. యస్ సి. ద్వితీయ.

ఈ యేడాది సైన్సు కాంగ్రెసు (Science Congress) యొక్క ముప్పదియోడవ సమావేశము పూనాలో జరిగినది. ఈ రోజులలో ఆటంబాంబు కనిపెట్టబడి, ఇంకను హైడ్రోజను బాంబు తయారు కానున్నప్పుడు సైన్సుయొక్క ఏ సమావేశము నైనను అనుమానముతో చూచెదరు. పూనా సైన్సు కాంగ్రెసును గురించి యటువంటి యనుమానము పడనక్కరలేదు. ఎందుకనగా మన దేశమునకు ఆటంబాంబు అనవసరము. ఎవరైన నొకవేళ మన దేశములో నొకపట్టణముపై ఆటంబాంబును ప్రయోగించినచో మేము — రెండవ చెంప చూపించు సిద్ధాంతముప్రకారము — ఇంకొక పట్టణముపైగూడ వేయుడని కోరుదుము. అంతగా దీనివల్ల పోవునగు నది మన స్వాతంత్ర్యమేకదా! అది తిరిగి సంపాదించుటకై — మన దేశము బుద్ధుడు, అశోకుడు, గాంధీ మొదలగు మహాపురుషుల జన్మభూమి కనుక — ఏ రెండువందల సంవత్సరముల వఱకైన నింకొక పుణ్యపురుషుడు జన్మింపకపోడను ధైర్యము మనకున్నది.

కాని యేటేట జరుగు ఈ సైన్సు కాంగ్రెసు సమావేశాలవలన కొంతమైనను మన శాస్త్రజ్ఞులలో చైతన్యము కల్గుచున్నది. అందులో ఈ ఏడాది విదేశముల నుండి కొంతమంది శాస్త్రజ్ఞులు వచ్చియుండిరి. వారి యుపన్యాసములు, వారి దేశములలో సైన్సు అభివృద్ధికి వారు చేసిన శ్రమ, ఇవన్నియు వినియూ లేక చదివియో మన ప్రభుత్వముకూడ తన దేశపు శాస్త్రజ్ఞులకు మిక్కిలి సహాయము చేయవలెనని గుర్తింపకపోరు. ఆ సహాయము ఇచ్చుటకేని కొంత మంది ఢిల్లీనుండియు, బొంబాయినుండియు పూనాకు వచ్చియుండిరి—ఢిల్లీ లో కొందఱకు అసలు సైన్సు కాంగ్రెసుయొక్క ఎన్నవ సమావేశమో తెలియక పోయినను గూడ.

మొదటిరోజు శాస్త్రజ్ఞులయొక్కయు, రాజకీయ నేతలయొక్కయు, సమ్మేళనము; ఒకరికొకరు స్వాగతము చెప్పికొనుటయు జరిగెను. దేశములోని వివిధప్రాంతముల నుండి ప్రతినిధులు వచ్చిరి. పూనా విశ్వవిద్యాలయ ఛాన్సలర్ మహారాజ సింహా ప్రతినిధులందరకును స్వాగతము చెప్పిరి. బొంబాయి ప్రధాని ఖేర్, శ్యామ ప్రసాదముఖర్జీ, జయాకరు గారలు మాట్లాడిరి. పండిత నెహ్రూ పూనాకు 'జాతీయ రాసాయనిక రసశాల' (National Chemical Laboratories)ను ప్రారంభించుటకై వచ్చియుండిరి. అప్పుడు ఆయన వైజ్ఞానికులలో నున్న నమ్మకమును వెల్లడించుటకై ఈ సమావేశమునకుగూడ హాజరైరి. 'దేశము ఇప్పుడు శాస్త్రజ్ఞుని ప్రాముఖ్యతను గుర్తించుచున్న' దనియన్నారు. వారింకా ఈలాగన్నారు. "రాజకీయ నేతలకు ఇప్పుడు

పరిస్థితి శాస్త్రమును గురించి యింతగా తెలియక పోయినను శాస్త్రజ్ఞుని పొగడు చున్నాడు. నేటి ప్రపంచము సైన్సు స్వాధీనములో నున్నదని గుర్తింపబడియును. కాని యే దేశములోగూడ రాజకీయవేత్త శాస్త్రజ్ఞుని సలహా వినుటలేదు." ఈమాటలతో పండితనెహ్రూ నేటి ప్రపంచములో శాస్త్రజ్ఞుని స్థితి తెలియజేసినారు. భారత దేశములోని సాంఘిక, ఆర్థికదుస్థితిని వైజ్ఞానికుడు రాజకీయవేత్త కలిసినచో సులభముగా దూరము చేయవచ్చునని చెప్పినారు. కాని ఆ కలిసే శుభసమయము ఎప్పుడో? ప్రొఫెసర్ మహలనోబిస్ అధ్యక్షోపన్యాసము నిచ్చిరి.

వారు నేషనల్ ప్లానింగులో (National plann-ing) సంఖ్యాసేకరణము(Statistics) వహించుపాత్రనుగురించి మాటాడిరి. "ఆహారోత్పత్తికి తోడుగా, ఎంత ఆహారము పండుచున్నది, ఎంత పంపకము జరుగుచున్నది: తెలిసికొనుటకూడ ముఖ్యము. భారత దేశము జనాభా లెక్కలువేసి పదేండ్లైనవి. అవికూడ విశ్వాస యోగ్యములుగావు. ఇంక నాలస్యము సహింపరానిది. ప్రతి సంవత్సరము మన జనాభా ఎంత పెరుగుచున్నదో తెలిసికోవలెను. ప్రతి ఆర్థికమండలములో ఆదాయము, ఎట్లు పంచబడుచున్నది ఎట్లు ఖర్చు చేయబడుచున్నది తెలిసికోవలెను. అంతవఱకు మన ఆహారోత్పత్తి ప్రయత్నముల యుపయోగమేమియు నుండదు", అనిమహలనోబిస్‌గారన్నారు.

ఈ రోజుననే విదేశీయ శాస్త్రజ్ఞులను పండితనెహ్రూకు పరిచయము గావించినారు. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, స్వీడన్ రష్యాలనుండి 22 మంది శాస్త్రజ్ఞులు వచ్చిరి. వీరిలో ముఖ్యులు: ఫ్రాన్సునుండి జోలియో దంపతులు; కాంప్టన్, కాండన్, మార్క్స్; అమెరికానుండి రాబిన్సన్, బెర్నాల్; బ్రిటన్‌నుండి [illegible]బెక్, స్వీడన్‌నుండి రష్యానుండి ఎంగెల్‌హార్ట్ ఆలస్యముగా వచ్చిరి. వీరిలో జోలియో దంపతులు కాంప్టన్, రాబిన్సన్, నోబెల్ బహుమతి పొందినవారు. వీరందఱును మన దేశమునకు ఇక్కడి సైన్సు అభివృద్ధిని గురించి వినుటకు వచ్చిరికాని వీరే ఎక్కువ వినిపింపవలసి వచ్చినది. ఎందుకనగా ఈ సమావేశములో భారత శాస్త్రజ్ఞులకంటె విదేశీయశాస్త్రజ్ఞులే ఎక్కువ ఉపన్యాసము లిచ్చినారు. అందుకొఱకు వీరిని గురించియే నేను అధికముగా వ్రాయుచున్నాను.

సర్ రాబిన్సన్‌గారును మార్క్స్‌గారును పెనిసిలిన్, సెలులోజ్ పై చేసిన పరిశోధనలగురించి మాట్లాడినారు.

మదాం జోలియోక్యూరీ, ఈమె కీ॥ శే॥ క్యూరీ దంపతుల కూతురు. ఈమెకూడ నోబెల్ బహుమతిపొందిన శాస్త్రజ్ఞురాలు. ఈమె నిరాడంబరజీవి. మామూలునూలుబట్టలు ధరించును. తల సరిగా దువ్వుకొనదు. సైన్సు కాంగ్రెసు అంటే పట్టుచీరలయొక్కయు, ఆభరణములయొక్కయు, ప్రదర్శనమని తప్పు అర్థము చేసికొని పూనాకు వచ్చిననారీమణులను చూచి ఆమె యేమనుకున్నదో! ఈమెతండ్రి పియర్ క్యూరీ లండన్‌లో ఒక సన్మానములో ఉపన్యాసమిచ్చుటకు వెళ్ళినప్పుడు, అక్కడకువచ్చిన యామువారి మెడలలోనున్న హారములతో ఎన్ని రసాయనికపరిశోధనశాలలు (Laboratories)కట్ట వచ్చునో లెక్క వేయుచుండినాడట! ఉపన్యాసమిచ్చుటకు లేచినప్పుడు ఆ కాశమువఱకు రస పరిశోధనశాలలు తయారైనవి!! వీరిలో ఎందఱు సైన్సుఅంటే అభిరుచియుండి వచ్చి

నారో? మదాం జోలియోక్యూరీ ఉపన్యాసము విని 'రేడియం అంటే ఎవరండీ'? అని తమభర్తల నడిగేవారు కూడ ఉందురని నా నమ్మకము. ఈమె రేడియో సంచలనమును (Radio activity) గూర్చి ప్రసంగించినది. "రేడియం కొన్ని కిరణములను ఎప్పుడును ప్రసరించుచుండును. ఇవి కంటికి కనిపించవు కాని కొన్ని యంత్రములపై వీని ప్రభావమువల్ల వీనిని తెలిసికొనవచ్చును. ఇటువంటి కిరణముల ప్రసరించుశక్తిని (Radio activity) అందురు. ఈ కిరణములు వైద్యములో చాల ఉపయోగపడును. ముఖ్యముగా 'కేన్సరు' కురుపును కుదుర్చుటకు ఎంతో పనికివచ్చును. కాని రేడియంవలె కిరణములు ప్రసరించు మూల పదార్థములు ఎక్కువగా లేవు. ఉన్నను వానిఖరీదు చాల ఎక్కువ, కాని 16 ఏండ్లక్రిందట మదాం జోలియోక్యూరీ, ఈమెభర్త కలిసి కనిపెట్టిన కృత్రిమ రేడియోసంచలనము (Artificial Radio activity) ఈచిక్కు విడదీసినది. రేడియంనుండి వెలువడు అల్ఫా కిరణములు కొన్ని మూల పదార్థములపై ప్రసరించిన యెడల అవియొక క్రొత్త మూల పదార్థముల క్రింద మారిపోవును. అప్పుడు అవికూడ (Radio activity) గుణము చూపించును. ఇప్పుడు ఇటువంటి కృత్రిమ రేడియో మూలపదార్థములు ఏండువందలకు పైగా తయారుచేయబడినవి. వీనిని చాల చవుకగాను పెద్ద రాసులుగాను తయారుచేయుటకు అటామిక్ పైలు (Atomic Pile) ను ఉపయోగింపవచ్చును. ఇంతవరకు ఇది 'యురేనియం' ను 'ప్లూటోనియం' క్రింద మార్చుటకుగా నుపయోగింపబడుచుండెడిది. ఈ 'ప్లూటోనియం' ఆటంబాంబు యారు చేయుటలో నుపయోగపడును. ఇప్పుడు ఈ (Atomic Pile) ను కృత్రిమ రేడియో మూలపదార్థములు తయారుచే యుటకు వాడవలెనని చెప్పినది మదాం జోలియోక్యూరీ. ఈ రేడియో మూలపదార్థాలతో చేసినమందులు శరీరములో ఏలాగ పనిచేయుచుండునో కనిపెట్టవచ్చును. ఎక్కి నగా ఇవి శరీరములో ఏభాగమునకు వెళ్ళుచున్నవో దాని రేడియో సంచలనము (Radio activity) గుణము వల్ల తెలిసికొనవచ్చును.

తర్వాత ఎస్. ఎన్. బోసుగారు మాట్లాడినారు. ఇటువంటి రేడియో మూల పదార్థములు మనదేశములో తయారగ నేర్పాటులు చేయవలెనని యనినారు. ఇక వ్యాధులపై మందులు ఎటువంటిపనిచేయునో యనునదికాకుండ మనదేశములో పంచదార మొదలగు ముఖ్యపదార్థములు ఎక్కువ మాయమగుచున్నవో కనిపెట్ట వచ్చునని హాస్యముగా అన్నారు.

ప్రొఫెసర్ కాంప్టన్ ఒకరోజు ఉపన్యసించినారు ఆయన అమెరికానుండి వచ్చినాడు. ఆటంబాంబునుతయారు చేయ నిమిత్తము ఏర్పాటుచేయబడిన కమిటీలో ఒ ముఖ్యసభ్యుడు. ఆటంబాంబును ఎందుకు ఉపయోగింపవలసి వచ్చినదో చెప్పినాడు. ఆటంబాంబును ప్రయోగించు సమయములో తత్ప్రయోగమును వ్యతిరేకించు వారును బలపరచువారును అమెరికాలో నుండిరి. వ్యతిరేకించువారి యభిప్రాయ మేమనగా ఒకవేళ అమెరికాయే ఆ బాంబును ప్రయోగించినచో తర్వాత ఇతర రాజ్యము లేవైన దానిని ప్రయోగించిన యెడల ఆక్షేపించుట కవకాశముండదు. రెండవది, అమెరికా చాల క్రూరముగాను దుర్మార్గముతోను యుద్ధము సాగించినద

నేరారోపణము చేయఁబడఁగలదు. ఇక రెండవ పక్షము వారిట్లువాదించిరి. ఈ బాంబును మనము ప్రయోగింపకపోయినను నేఁడు గాకున్న రేపు పరరాజ్యములు దీనిని కనిపెట్టి తప్పకుండ ప్రయోగింపఁగలవు. ఇదియునుగాక ఇప్పటికే యుద్ధమారంభమై చాల కాలమైనది. ఇంకను నిడనిస్తే సాగించినచో మఱింత ప్రాణనష్టమును సర్వనాశనమును దప్ప మఱేమియు లాభము లేదు. అందుకొఱకు దీనిని ప్రయోగించి యుద్ధసమాప్తి త్వరగాఁ గావింపవలెను. ఈ బాంబును తయారుచేసిన వారుకూడ ఈ యుద్దేశములోనే తయారుచేసినారని చెప్పినారు కాంప్టన్‌గారు.

ఈయన ఎంతచెప్పినను ఈ బాంబు హిరోషిమాలో 60,000 మందియొక్కయు, నాగాసాకిలో 45, 000 మందియొక్కయు, చావుకు కారణమైనది. వేలకొలఁది తీవ్రముగా గాయపడినారు. ఎన్నియో ప్రదేశములు మట్టిమైపోయినవి. రష్యా జపానుపై యుద్ధము ప్రకటించిన కొన్నిరోజులలోనే అమెరికా జపానుపై అటంబాంబు ప్రయోగించినది.

పూనాకు వచ్చిన శాస్త్రజ్ఞులందఱును అణుశక్తి (Atomic - Power) ని శాంతిసాధనకై యుపయోగింపవలెనని చెప్పినారు. అటంబాంబు ఉపయోగమును తీవ్రముగా ఖండించినారు. ఇటువంటి బాంబులకై లక్షలకొలఁది డాలర్లు వ్యయించుట అవివేకమని చెప్పినారు. ఇటుల చెప్పినవారిలో ముఖ్యులు కాండన్, ఐడ్‌బెక్, బెర్నాల్ గారలు. కాండన్, అమెరికాలో నేషనల్ బ్యూరో ఆఫ్ స్టాండర్డ్సు(National Bureau of Standards) కు డైరెక్టరు. దేశములో కొలతకై ఉపయోగింపఁబడు పరికరములపై పరిశోధనలు చేయుచుందురు. ఈయన తన శాఖతరఫున రామన్‌గారికి ఒక మిల్లిగ్రామ్ మెర్క్యురీ ఐసోటోపు (Mercury isotope) కానుక నిచ్చినారు! ఇతని శాఖలో కొన్ని వేలమంది పనిచేయుదురు. అమెరికా ప్రభుత్వము దీనికై చాలడబ్బు ఖర్చుపెట్టుచున్నది. అయినను అటంబాంబు తయారగుచున్న రోజులలో ఇక్కడకూడ కొన్ని అవసరమైన పరికరములు తయారుచేయవలసి వచ్చినదట!

ఐడ్‌బెక్ స్వీడెన్ నుండి వచ్చినారు. తన దేశములో జరిగిన పరిశోధనలను గుఱించి చెప్పినారు. స్వీడెను గడచిన రెండు యుద్ధములలోఁగూడ తటస్థముగా నుండెనది. నార్వేతోఁగల కొన్ని సమస్యలనుకూడ వీరు శాంతియుతముగానే పరిష్కరించుకొనినారు. ఈ శాంతి వాతావరణములో స్వీడను శాస్త్రజ్ఞులు చాల పరిశోధనలు చేసినారు. ఇతనికిఁగూడ అణుశక్తిని యుద్ధములో నుపయోగించుట అమానుషముగా తోఁచినది.

డెస్మండ్ బెర్నాల్‌గారు ఇంగ్లండునుండి వచ్చిరి. ఇతఁడు గొప్ప పదార్థ శాస్త్రజ్ఞుడే (Physicist) కాకుండ (International Scientific Workers' Union.) అంతర్జాతీయ వైజ్ఞానిక కార్మికుల సంఘమునకు ఉపాధ్యక్షుఁడు. అభ్యుదయ భావములుగల వాఁడు. ప్రపంచములోని అన్ని దేశములలోను సైన్సు అభివృద్ధిని గుఱించియు, దాని చరిత్రను తెలిసికొనవలెనని యభిలాష యున్నది. సైన్సు అభివృద్ధి యెప్పుడును ఒకేరీతిగా నుండదన్నారు. భారతదేశ మొకప్పుడు శాస్త్రవిజ్ఞానములో నన్ని దేశములలో నగ్రగణ్యముగా నుండియుండెను. కాని అతర్వాత భౌతిక శాస్త్రాభివృద్ధి పూర్తిగా క్షీణించిపోయినది. దీనికి కారణము శాస్త్రజ్ఞానము

ఏ కొద్దిమంది చేతులలోనో యుండుటే. సామాన్య ప్రజలలో శాస్త్రజ్ఞానము వ్యాపించకుండ నుండినయెడల ఆ దేశములో సైన్సు అభివృద్ధి యటుంచి దాని పేరే లేకుండఁ బోవును. భారతదేశములోఁగూడ శాస్త్రజ్ఞానము నశించుట కిదే కారణమై యుండునన్నారు.

విజ్ఞాన బీజములు భారత చీనా దేశములలోనే పుట్టినవి. కాని యవి పుష్పించి ఫలించినది పశ్చిమ దేశములలోనే. భారత చీనా దేశములలో పూర్వాచార పరాయణత్వమే దీనికి కారణమని బెర్నాల్‌గా రన్నారు. ప్రతి విషయమును పూర్వ సాంప్రదాయానుసారమే చేయువారే కాని మార్పేమియు నుండియుండక పోయెడిది. దీనినే మనము నేటికిని ఇటికెలు తయారు చేయుటయందును, పొలములు దున్నుట యందును జూచుచున్నాము. బట్టలు నేయుటలో మన దేశమునకు అగ్రస్థాన ముండెడిది. కాని వానిలో ఏ మాత్రము మార్పు కలిగింపనందున ఆ పరిశ్రమలు మన దేశములో వెనుకఁబడిపోయినవి. మార్పువల్లనే పశ్చిమ దేశములలో పరిశ్రమలు వృద్ధిగాంచి యక్కడ పారిశ్రామిక విప్లవము (Industrial revolution) జరిగినది.

నేఁడు ప్రపంచములో సైన్సుకు గొప్ప స్థానమున్నది. అది మన సమస్యలను పరిష్కరింపకపోయినను పరిష్కార మార్గమును మాత్రము గోచరింపఁ జేయును. కాబట్టి దానిని సంపూర్ణముగా వినియోగించుకో వలెనని బెర్నాల్‌గా రన్నారు.

ఇవి పూనా కాంగ్రెసులో ఇవ్వఁబడిన యుపన్యాసముల సారాంశములు. వీనివలన మనము నేర్చుకోవలసిన దెంతయో ఉన్నది. మన దేశము పారిశ్రామిక విప్లవముయొక్క శైశవదశలోనే యున్నది. ఇతర దేశములతోఁ బోల్చిచూడఁగా మనము చాల వెనుకఁబడి యున్నాము. బెల్జియం, స్వీడన్ వంటి చిన్న దేశములే మన దేశములో తయారగునంత ఉక్కును తయారు చేయుచున్నవి. మన దేశములో కావలసినంత యినుమున్నది, బొగ్గున్నది. కాని మన కవసరమగునంత ఉక్కును మాత్రము తయారుచేసికో లేక పోవుచున్నాము. ఒక ఉక్కే మిటి? ప్రతి విషయములోను ఇంతే. ఆహారధాన్యముల పంట, గుడ్డలు తయారుచేయుట ఏటేట తగ్గుచున్నదే కాని హెచ్చుటలేదు. దీనికి తోడు మన జనాభా ప్రతి సంవత్సరము ఏబదిలక్షల చొప్పున పెరుగుచున్నది. ఇప్పుడున్న జనాభాకు తగినంత పనిలేకుండ నున్నది. ఈ మానవశక్తిని ఉపయోగములోనికి తీసికొని రావలెను. ఎక్కడెక్కడ సైన్సు అభివృద్ధి కవకాశము లున్నవో అక్కడక్కడ అభివృద్ధికి తీసికొనిరావలెను. ఉష్ణ విపరీతమైన చలిప్రదేశములలో సైతము సైన్సు సహాయముతో గోధుమలు పండించుచున్నవి. మనము మామూలుగా గోధుమలు మొదలగువానికి అనువైన చోటులలోఁగూడ పండించలేమా ?

*



# గోత్రాలగోల

వి. సి. ఎల్. నరసింహారావు
పూర్వవిద్యార్థి.

౧

కాఫీ త్రాగివచ్చి సత్యం, నేనూ మాట్లాడుతూ కూర్చున్నాము.

"ఆరేయ్ సత్యం! గోపాలరావింకా రాలేదేమిరా!"

"నేనూ అదే అనుకొంటున్నాను. వాడు పెళ్ళికివెళ్ళి పదిరోజులు కావటంలేదూ!"

ఇంతలోనే గోపాలరావు గదిలోకి ఊడిపడ్డాడు. వచ్చీ రావటంతోనే ఆ కన్నెక్కడి రాగంమీద "ఎన్నోకొండలు గుండెల్లో కరగి షోయెన్ వార్ధి సంతానమ్ముల్ గన్నిరయ్యో" అని మంచంమీద బోర్లా పడుకొని చదవటం మొదలెట్టాడు.

"ఏమిటిరా! ఇవాళేదో వింతధోరణిలో ఉన్నావే!" అన్నాను.

"ఏదో కథ యీ సారి మనకు వినిపించే అట్టేవుంది" అన్నాడు సత్యం.

గోపాల్ యెప్పుడూ యేవో తన స్వీయ చరిత్రలోని ఘట్టాలు వినిపిస్తూంటాడు. అవి సాధారణంగా యెవరూ నమ్మరు కాని వినటానికి చాలా సొంపుగానే ఉంటాయి.

"గోపాల్! సంగతేమిటో చెప్పరా. నీ కథలు వినక చాలా రోజులైంది" అనిసత్యం మళ్ళీ అన్నాడు.

"ఇదిగో నేనేదో సిన్సియరుగా (Sincere) నాఅనుభవాలు మీకు అప్పుడప్పుడు చెప్తూంటే మీరంతా నవ్వులాటగా వుందే-సరే! అలాంటప్పుడు నేనేమిచెప్పి మిమ్మల్ని బాధిస్తాలే! అయినా నాకు అంతా నవ్వులాటే అయిపోయిందిలేండి"

"గోపాల్! సత్యం యెప్పుడూ అలానే అంటూవుంటాడు. కాని నీవు చెప్పేవి పూర్తిగా అబద్ధాలని నేనెప్పుడూ అనుకోలేను. ఇప్పటి సిద్ధాంతం చూస్తే నిజంగా యేదో జరిగినట్లుగావుంది. చెప్పరా! నీ బాధ దానివల్ల కొంత తగ్గవచ్చు."

ఇలా కొంతసేపు బతిమాలించుకొని గోపాల్ యిలాచెప్పటం ప్రారంభించాడు:-

"మొన్న మేమంతా పెళ్ళికి వెళ్ళటప్పుడు గుంటూరులో రైలుదిగి బస్సెక్కాల్సొచ్చింది. బస్సు భోగా నిండిపోయింది. ఆగిన చోట్లల్లా యెక్కటమే కాని ఒక్కరూ దిగటంలేదు. మొగలితుర్రులో యెవరో ఇద్దరు దిగిపోయినా, ఆయన వెంట పదిహేనేండ్ల పిల్లా, బస్సెక్కారు

సీట్లుకూడా ఖాళీలేవు. పెద్దాయన నిలబడి ఉంటే ఫరవాలేదనిపించింది కాని ఆ పిల్ల మారుగా తెగ నుంచుండటం నా హృదయాన్ని సహించలేకపోయింది అప్పుడు నేను లేచి "ఇక్కడ కూర్చో అమ్మాయీ" అన్నాను. అని నేను రెండోవైపు తిరిగి చూద్దునుగదా కనుపాప సింహాసనమున సౌందర్యరాణి కూర్చుందనుకుంటే ఇంతకంటె ముందే కూర్చున్నతను (ఆ పిల్లతండ్రి) నాస్థానంలో కూర్చున్నాడు. అతను చాలా ముసలి వాడుగా ఉండబట్టి కూర్చోనిచ్చాను.

ఇంక కొంతసేపట్లో పరచూరు వచ్చింది. మేము దిగాము. మాతోపాటు ఆ పెద్ద మనిషీ, ఆ అమ్మాయికూడా దిగారు. పర

చూరినుండి పెండ్లివారైన వుప్పుటూరుకు బండ్లమీద వెళ్ళాలి. అప్పటికే బండ్లన్నీ నిండిపోయాయి. ఒకచిన్న కచ్చడంమాత్రం మిగిలిపోయింది. అందులో నన్నూ ఆ అమ్మాయిని కూర్చోమన్నారు. అప్పుడు తెలిసింది నాకు, వాళ్ళూ పెళ్ళికి వచ్చిన వారేనని. ఆ ముసలాయనకు మాయిద్దర్నీ ఒక్కచో వదిలిపెట్టడం ఇష్టంలేదు కాని ఆయన బాల్యస్నేహితు లెవరో బలవంతంచేసి ఆయన్ను తమదగ్గర కూర్చోబెట్టుకున్నారు.

బండిలో మేమిద్దరమే వున్నాము. ఆ అమ్మాయి చాల అందంగావుంది. మొదటి చూపులోనే నన్నాకర్షించింది. ప్రేమ శుద్ధ అబద్ధమనీ, కామం తీర్చుకునేందుకు ఒక స్త్రీని ఉపయోగించుకోనేటప్పుడు కలిగే ఆమనుశనే ప్రేమ అంటారనీ అది యెవరిమీదనయినా పొడచూపననీ అనుకునే నాకు ప్రేమయాత్రికు మొదలగు వారిలో కొంత నమ్మకం కలిగింది.

నాకామెతో యేమేమో మాట్లాడా లనిపించింది. కానియేమీ మాట్లాడ లేకపోయాను ఆమె చాల నిశ్చింతగా కూర్చున్నది. కాని మాకళ్ళు మాట్లాడుకున్నాయి. మొదట్లో కొత్తదనంచేత ఆ మెత్తటిస్తులు నన్ను కోపగించుచున్నవా అనిపించింది గాని తరువాత ఆమె ముఖంచాలా ప్రసన్నంగా తోచింది.

"మీరు నాతో మాట్లాడా లనుకుంటున్నారు కదూ?" అన్నదామె.

"లేదు" అని జంకుతూ అన్నాను. మళ్ళీ వస్తాయించి "అవును" అన్నాను.

"మరే మనిమాట్లాడుతారు?" అన్నది.

"నిన్ను నేను ప్రేమిస్తున్నాను" అని సాధారణంగా ప్రేమికులు కావ్యాల్లో, సినిమాల్లో అన్నట్లన్నాను.

"'నిక్కముదాపనేల? ధరణీసుర నందన! యింకనీవయిం - జిక్కమనంబు నాకు' అని నేనంటాననుకున్నారేమో? కాని నేనట్లా అనను" అని నవ్వుతూ అన్నది,

"అట్లైన రాక్షసవిధి నిన్ను బరిణయం బాడెద" అన్నాను. ఆమె ధోరణి చూస్తే నాభయం కొంతపోయింది. దానిమీద యిద్దరమూ నవ్వుకున్నాము.

ఇంతలో ఉప్పుటూరు వచ్చింది. మేమంతా దిగాము. పెళ్ళివారు మాకు చెరువుగట్టునున్న ఒక బంగళాపై విడిది యేర్పాటు చేశారు. ఆ అమ్మాయి పెళ్ళికూతురికి దగ్గర బంధువు కాబట్టి పెళ్ళివారింటికి వెళ్ళిపోయింది.

అప్పటికి చీకటి పడడం వల్ల భోజనాలు చేశాము. అలసటగా వుండబట్టి భోంచేసి పడుకోగానే నిద్రపట్టింది.

౨

"అన్నయ్యా! యింకా లేవలేమి? ప్రొద్దున ఫలాహారం చేయలేదు, యేమీ లేదు. ఇక్కడికి పదిగంటలవచ్చి లేపినా లేవవు." అని నాచెల్లెలు వచ్చి అన్నది.

"లేస్తాలేవే" అన్నాను ఆవులిస్తూ.

"ఇంకెప్పుడూ? అదిగో పెళ్ళివారు భోజనాలకు పిలవడానికి వస్తున్నారు. వాళ్ళు చూస్తే నవ్వుతారు."

పెళ్ళివారనేమాట విని ఉలిక్కిపడిలేచాను. పదకొండుగంట లయింది. పెళ్ళివారు మొదటిసారి భోజనాలకు పిలవడానికి బయలుదేరుతున్నట్లు మేళాల చప్పుళ్ళు చెపుతున్నాయి.

నేను తొందరగా మొహం కడుక్కొని స్నానంచేసి వచ్చి పైనగదిలో నాకు చిన కాఫీ తాగుతున్నాను. ఇంతలో యెవరో

పైకి వస్తూన్నట్లనిపించింది. మెట్లవైపు చూద్దునుగదా ఆ అమ్మాయే! నవ్వుతూ నుంచున్నది.

"ఓహో! ఇప్పుడే లేచినట్టుందే? అందరిని భోజనాలకైతే మిమ్మల్ని కాఫీకి పిలువవలసి వచ్చిందే!" అన్నది.

నేను నవ్వుతూ "కూర్చో! కాసేపు మాట్లాడుకుందాం" అన్నాను.

"వల్లకాదు బాబు - కింద అంతా వున్నారు. ఇక్కడ కూచుంటే యెలా! ఏమిటో త్వరగా చెప్పండి" అన్నదామె.

"మొదటిసంగతేమిటంటే నాకిప్పుడు కాఫీ యేవుంది గాని, ఫలాహారము లేదు. వెళ్ళి దయచేసి కొంచెం ఫలాహారం పంపించండి."

"ఇక సెలవిప్పిస్తారా మరి ?

"అయ్యో, అయ్యో, ముఖ్యమైన సంగతే వినవా? చూడు! నేను......నిన్ను ప్రేమించాను, నిన్ను...పెళ్లిచేసుకొంటాను. నీకిష్టమైతే......"

అనగానే సిగ్గుపడి "నాన్ననుకనుక్కోండి" అని పారిపోయింది.

కాస్సేపటికి ఫలాహారము రాగా తింటూకూర్చున్నాను. ఇంతలో చెల్లాయి వచ్చి "అన్నయ్యా! నీతాళపుచెవి కొంచెమివ్వు" అన్నది.

"ఇస్తాకాని, ఒకపనిచేయవూ? మా బాబుగదూ, మా బాబుగదూ, మా అప్పగదూ"

"ఏమిటీ?"

"ఆ అమ్మాయి సరళవుందే, ఆమె నాన్నగారితో చెప్పి సరళను నాకిచ్చి పెళ్ళి చేసేట్టు సిఫారసుచేయాలి. చూడుపద్మా! నేనామెను తప్ప ఇంకెవరినీ పెళ్ళిచేసుకోను. ఇదిచేస్తివా నీకోమంచిచీర"

ఇలా నేననగానే పద్మవిరుగబడి నవ్వసాగింది. "యెందుకే?" అంటే చెప్పదు. చివరకు ఆమె ఇట్లా చెప్పింది. "సరళతండ్రికి మొదటే ఆ అమ్మాయిని నీకివ్వాలని బుద్ధి పుట్టింది. నీచదువూ మొదలైనవన్నీ తెలుసుకున్నాడు. ఇవ్వాళ ఆయన మన గోత్రమడిగ్గా నేను చెప్పాను. ఆయన విస్తుపోగా "యేమండీ? అలాచూస్తా" రన్నాను.

"యేమీలేదమ్మా! మాదీ భారద్వాజసగోత్రమే. చక్కగా యీడూ, జోడూ, అందచందంగా వుంటుందని మీఅన్నయ్యకు మా సరళనిద్దామనుకొన్నానమ్మా! ఈ గోత్రాల తిప్పలవల్ల యింకా యెన్ని సంబంధాలిల్లాతున్నాయో అన్నాడు."

"ఆ! ఆ!" అన్నాను.

*

పాశ్చాత్య పండితుడు:-

"తనభార్యప్రేమకు పాత్రుడు కాని దురదృష్టవంతుడు, తాను సౌందర్య సంపదలు లేనివాడుగా దలంచుకొనునేమో? కాదు, నమ్ముడు: అతడు తన మితిమీరిన మెత్తదనము వల్లను, ప్రేమవల్లను, ఈ దురదృష్టమునకు జిక్కికొని యుండును......సృష్ట్యాదినుండి సుకుమారమైన స్త్రీజాతి యీ క్రూరుడును భయంకరుడును అగు పురుషుని వశపఱచికొనుటకై ప్రత్యేకమైన పద్ధతులు నేర్చుకొనుచు వచ్చుచున్నది. ఒకవేళ నామెకు ప్రయత్నము లేకుండనే వశుడైనవాడు లభించినచో నామె యీ సమ్మోహనాస్త్రములు- ఏవి తన తల్లులనుండియు, నాయనమ్మలనుండియు, పారంపర్యముగా లభించునో- మఱియు సుదీర్ఘకాలమునుండి ప్రయోగింపబడుచున్న కారణమున జాలవఱకు ప్రతిభావంతములై యున్నవో- వ్యర్థము లగుటయే కాక ఆడుదానికి అనవసరభారములుగా దోచును."

# ఆత్మార్పణము (మాతృక : రవీంద్రుని "fruit - gathering")

బి. రామరాజు ఎం. ఏ. (ప్రథమ)

చ॥ మును శిశునాగవార్ధి పరిపూర్ణశశాంకుడు తారహారచం
దన ఘనసార చారు గుణధాముడు బౌద్ధమతప్రచార జీ
వనుడగు బింబిసారనరపాలుడు ధర్మము నాల్గు పాదముల్
దనరగ నేలె, శాంతి మగధామహినంతట తాండవింపగన్. ౧

ఉ॥ ఆ నరపాలమౌళి భరతావని శాంతి సుధాప్రవాహ వీ
చీ నిచయాల దేల్చిన సుశీతలమూర్తిని గౌతమున్ నిజో
ద్యానవనంబునం దొకమహాలయ మందున నిల్పి లోక క
ల్యాణము కోసమై బ్రతుకు నంజలి పట్టెను బౌద్ధదీక్షతో. ౨

గీ॥ సంధ్యవేళ బుద్ధార్చనా సమయమందు । రాజ శుద్ధాంత కాంతలు ప్రతిదినంబు
పూలు నివ్వాళు లర్పించి పూజసేయ। ముగ్ధమూర్తులై యచ్చోట మూగుచుండ్రి. 3

గీ॥ బింబిసారనృపాలుండు పెద్దకాల । మవని బరిపాలనము సేయ నంతవఱకు
బుద్ధదేవు నిలోకించిన పూజలందు । లోటులేకయ్యె నన్నంత లోననెపుడు. ౪

మ॥ యువరాజైన యజాతశత్రుడొకనాడా యోపాయమున్ బన్ని భూ
ధవు బందీగ నొనర్చి, బౌద్ధుల పవిత్ర గ్రంథముల్ గాల్చి, మే
న విభూతిన్ ధరియించి, భిక్షుకుల ప్రాణాలీసి, కాళీమహా
హవనం బాచరణంబుజేసె నవరక్తాజ్యాహుతుల్ వ్రేల్చియున్.

గీ॥ "బుద్ధ పూజలు సల్పెడు మూఢజనము । లెవ్వరైనను మగధోర్వి నెచటనైన
భయద కరవాలధారకు బలి" యటంచు । చండ తర శాసనంబుల జాటజేసె. ౬

గీ॥ తండ్రి చెక్కించిపోయిన ధర్మశాస । నములు బౌద్ధుల రక్తాంకితములు సేయ
చలువ వెన్నెల లొలికెడు శాంతిదేవి । కన్నుగొలకుల రక్తాశ్రుకణము లురలె. ౭

గీ॥ అదియఖిల ధారుణీ ప్రజకంతటికిని । సర్వ భూతకోటికిగూడ పర్వదినము
లుంబినీవన పుణ్యప్రాంతంబు లందు । శాంతి యవతరించిన సుప్రశాంత దినము. ౮

గీ॥ రాగరంజిత కరముల రవిప్రియుండు । సందెకన్నె చెక్కిళ్ళకు జందనమిడె
సమయమయ్యెను శాక్యర్షి చరణములకు । ఆత్మపుష్ప సమర్పణం బాచరింప. ౯

గీ॥ రాణి చెలికత్తె "శ్రీమతీ" రమణి యపుడు । అమలమా గాంగపుణ్యాలోయముల దోఁగి
ధవళ కాంతుల శుభ్రవస్త్రములు దాల్చి । బుద్ధపదపద్మ సేవకు సిద్ధమయ్యె. ౧౦

గీ॥ ఫుల్ల నవమల్లికామల పుష్పచయము । దివ్యరుచి రోజ్జ్వలానర్ఘ దీపపంక్తి
పసిడి పళ్ళెరమందునఁ బదిలపఱచి । తిన్నఁగా వెడలెను శ్రీమతీకుమారి. ౧౧

గీ॥ కలువ కన్నుల యందానఁ గందళించు, భక్తిగాఢదీక్ష కన్పట్టెనేమొ?
గడగడ వడంకినది రాణి గాత్రమపుడు, ప్రబల గద్గద కంఠియై పలికె నామె. ౧౨

శా॥ "ఓ నిర్భాగ్యతపస్వినీ! ప్రళయమేదో వచ్చె నీనాఁడు లే
దా నీయాయువు మూడియుండు — భయదంబౌ బుద్ధపూజావిధుల్
ఈనాఁ డెందుకు? శాంతిదేవి భువిలో నెప్డో మహానగ్నకా
ళీ నాట్యంబున నూపిరాడకయె కూలెన్ దెల్యదా? బేలవా?. ౧౩

గీ॥ 'బుద్ధపూజలు సల్పెడు మూర్ఖజనము । లెవ్వరైనను మగధోర్వి నెచటనైన
భయద కరవాల ధారకుబలి' యటంచు । చండతర శాసనంబులఁ జాటవినవె" ౧౪

గీ॥ అనుచుఁ బల్కినవమానమే యాదరముగ । రాణికి నమస్సులనిడి శిరంబు వాల్చి
చేరఁగాఁబోయె నింకొక ద్వారసీమ । కచట యువరాజభార్యయౌ "అమిత" యుండె. ౧౫

గీ॥ అంకపీఠాన నొకమించు టద్దముంచి, దీర్ఘ నీలాలకంబుల దిద్దికట్టి
కేశవీథిని కుంకుమాంకిత మొనర్చు క్రొత్త పెండ్లికూతురు ముఖమెత్తిచూచె. ౧౬

గీ॥ చూచి చూచుటతోడనే సుందరాంగి । గాత్రవల్లరి నిలువెల్ల కంపమందె
"నాకు కీడేదియో తెచ్చినావు ఇటకు । వేగమీ ప్రదేశమునుండి వెడలు" మనియె. ౧౭

గీ॥ జరిగిన పరాభవంబుల సరకు గొనక, వెడలిపోయెను శ్రీమతి వేగిరముగ
రమ్య శుభగాత్రి మాగధరాజపుత్రి । మందిరమయూరి "శుక్లాకుమారి" కడకు. ౧౮

గీ॥ మాధవీ లతావృత మగు మంటపమున । పాలరాలతోఁ జెక్కిన జాలకమున
అపరభాస్కర కిరణాల యరుణకాంతి । సరస శృంగార కావ్యమ్ము జదువుచున్న. ౧౯

గీ॥ "శుక్ల" రాకనప్డె వెనుదిర్గి చూచునంత । శ్రీమతిన్ గాంచె నుపహార శ్రీలతోడ
చదువు పుస్తకమొడినుండి జారవిడచి । సజల నయనాలతో "శుక్ల" సఖికినుడివె. ౨౦

మ॥ "సకియా! యేమిటి కిట్టి సాహసము? దుస్సాధ్యంబులౌ దీక్ష లెం
దుకు సాధింతు? వజాతశత్రుఁ డిప్పుడెంతో యల్గునీపైనఁ దా
పక శృంగార వపుర్విలాస రుచి భాస్వద్యౌవనారామ సీ
మకుఁ గార్చిచ్చు దగుల్కొనన్ బ్రళయ శుంభజ్జ్వాలికా మాలనై. ౨౧

గీ॥ రాజధిక్కార కారణ పూజలేల? । భీకరోగ్ర మృత్యుముఖ ప్రవేశమేల?
మరలి పోవమ్మ! యీ పూజ మానుమమ్మ!" । యనుచు బ్రతిమాలినను
వ్యర్థమయ్యెఁ దుదకు. ౨౨

గీ॥ శ్రీమతి యొకొక్క ద్వారము చెంత కేగి । "రాజ శుద్ధాంతకాంతలు! రండు! బుద్ధ
దేవ పాదారవింద సంసేవనమున । జాగు సేయకుఁ" డని ముందు సాగిపోయె. ౨౩

గీ॥ కాని యచ్చటి శుద్ధాంతకాంత లెవరు । కాలు గదుపుట యట్లుంచి గేలిచేసి
కలికి కోమల హృదయంబు కలత పఱచి । ద్వారబంధన మొనరించినారువారు. ౨౪

గీ॥ రాజమందిర గోపుర రమ్యభర్మ । కలశ కాంతితో సయ్యాట సలిపి సలిపి
కుంకుమలు చల్లి పోయెను పంకజాప్తు । చరమ కిరణంబు పూర్తిగా నురగి పోయె ౨౫

గీ॥ కారునీడలు వీథులఁ గ్రమ్ముకొనియె । అన్ని దిక్కుల నిశ్శబ్ద మలముకొనియె
అంబికేశు మందిర ఘంటికారవంబు । సంధ్యపూజల కిప్పుడే సమయ మనియె. ౨౬

చ॥ చకచక లాడిపోయినవి శారదరాత్రి ననంతకోటి తా
రకలు మహాంధకార నికరంబులు సాంద్రపరోవరం బటుల్
ప్రకటితమయ్యె, నత్తరిని బౌద్ధమహాలయ మందు దీపకో
రకములు గాంచి క్రుద్ధులయి రాడ్భటులెత్తిరి క్రూరఖడ్గముల్. ౨౭

గీ॥ ప్రళయ జలధర గంభీర భాషణముల । "రాజశాసన ధిక్కార పూజసల్పి
మృతికి జడియని పశువ! యెవ్వతెవె నీవు?" । అనుచుఁ బ్రశ్నింప శ్రీమతి
యనియె నిటుల. ౨౮

గీ॥ "శ్రీమతిని నేను బుద్ధుని సేవ సేయు । ప్రాణి" నన నామె తియ్యని పల్కులప్పుడు
ప్రణయ మోహనమైన యా ప్రకృతియందు । మారుమ్రోగెను శీతల
మారుతమున. ౨౯

గీ॥ వెంటనే యత్తలిరుబోడి వేడినెత్తు । ధారలై చిమ్మె యంతటఁ బారెనేమొ?
ఆర్ద్రమైన తదాలయ ప్రాంగణమున । అమల చంద్రోపలములన్ని
యరుణమయ్యె. ౩౦

గీ॥ నిస్తరంగ సరస్సటు నెగడు నింగిఁ । దారకా కోరకంబులు దనరుచుండ
మనము గరఁగించు బుద్ధ సమాధి చెంత । అంత్యదీపకళికరుచి యారిపోయె. ౩

# రూపాయి విలువ తగ్గింపు
# (Devaluation)



యల్. నరసయ్య, బి. ఎ. (ద్వితీయ).

ప్రపంచములో నే దేశముగూడ వ్యాపారికముగాను, పారిశ్రామికముగాను స్వయంపోషకముగా లేదు. కావున ప్రపంచములోని దేశములన్నియును తాముత్పత్తి చేసిన సరకులనుండి తమకు నేయు సరకుల నుంచుకొని, మిగిలినవానిని పరదేశములకు విక్రయించుచున్నవి. ఏ సరకులు తమ దేశమున నుత్పత్తి కావో, ఒకవేళ ఉత్పత్తి చేయనయినను ఏవి అతివ్యయమున నగునో, వానిని ఇతర దేశములనుండి కొనుచున్నవి. ఈ విధముగా నంతర్జాతీయ వ్యాపారము (International trade) ఏర్పడినది. ఈవిధానములో నన్ని దేశముల కైక్యము ముడిపడి యున్నది. అంతర్జాతీయ వ్యాపారమంతయు నెగుమతి దిగుమతులమీఁద నాధారపడి యున్నది. దిగుమతి (Import) యనఁగా నొక దేశము ఇతర దేశములనుండి సరకులను తెప్పించుకొనుట. ఎగుమతి (Export) యనఁగా నొక దేశము వేఱొక దేశమునకు సరకులను విక్రయించుట. ఎగుమతి దిగుమతులు ఒక్క సరకులది మాత్రమే జరుగదు. సేవలు (Services) గూడ నెగుమతి దిగుమతులు చేయఁబడును. ఎగుమతికన్న దిగుమతి యధికమైనచో, దానిని ప్రతికూల వ్యాపార శేషము (Un-favourable balance of payment) అందురు. దిగుమతికన్న నెగుమతి యధికమైనచో, దానిని అనుకూల వ్యాపార శేషము (Favourable balance of payment) అందురు. ప్రతిదేశము గూడ వ్యాపారపు లావాదేవీలు తమ కనుకూలముగా, అనఁగా నెగుమతు లెక్కువయును, దిగుమతులు తక్కువయును జేయఁ బ్రయత్నించుచుండును.

అంతర్జాతీయ వాణిజ్య చరిత్రలో ౧౯౩౧ లోని సెప్టెంబరు నెల అతి ముఖ్యమైనది. అప్పుడు బ్రిటను ఒక్కసారి 'పౌను స్టెర్లింగ్' మారకపుఁ బ్రమాణము నిర్ణయించుకొనినది. కాని బ్రిటను బంగారపుఁ బ్రమాణమును బరిత్యజించిన యత్నము నిష్ఫలముగాఁ బరిణమించినది. బ్రిటను బంగారపుఁ బ్రమాణమును బరిత్యజించి 'పౌను స్టెర్లింగ్' ప్రమాణమును స్వీకరించుటకుఁ గారణము మొదటి ప్రపంచయుద్ధము (1914-1918)లోఁ గలిగిన యార్థికలోపమే.

రెండవ ప్రపంచ యుద్ధములో బ్రిటను, ఐరోపా రాజ్యములు మొదలగు పారిశ్రామిక దేశములు ఆర్థికముగాఁ జాల దెబ్బతినినవి. మొదటి ప్రపంచసంగ్రామము తర్వాత నంతర్జాతీయ వ్యాపారములో నేర్పడిన వాతావరణమే రెండవప్రపంచ సంగ్రామానంతరము గూడ నేర్పడినది. బ్రిటను మఱియు నితర పారిశ్రామిక దేశముల పరిశ్రమలు నష్టపడినవి. పరిశ్రమాభివృద్ధికై

ప్రత్యేకింపఁబడిన మూలధనము యుద్ధావసరములకై వినియోగింపఁబడినది. కావున ఆ దేశములలోని యుత్పత్తి సాధనములన్నియు వెనుకఁబడినవి. ఆ దేశములందు సరకులధరలు హెచ్చినవి. విశేషించి బ్రిటను యొక్క ఓడలు, యంత్రములు, ఇతర పరికరములు యుద్ధమున కాహుతియైనవి. ఆర్థికవ్యవస్థ పతనము తీవ్రమైనది. అంతవఱకు యుద్ధములో, అమెరికా బ్రిటనునకు యంత్రములు, ధాన్యములు మఱియు నితర పరికరముల సహాయము చేయుచుండెను. యుద్ధము ముగిసినతర్వాత అమెరికా బ్రిటనునకు సహాయముచేయుట మానుకొనెను. ముందే బ్రిటను ఆర్థికముగా కుంటుపడినదనిన, అమెరికాయొక్క యీ వైఖరి బ్రిటనుకు 'గోరుచుట్టుపై రోకలిపోటు' లనుచందమయ్యెను. బ్రిటను తన్నెదుర్కొనుచున్న ఆర్థికసమస్యను బరిష్కరించుటకు వేరు సదుపాయము లేక తా నంతకుపూర్వము పరదేశములలో వినియోగించిన మూలధనము నమ్ముకొనెను. అప్పటికిఁగూడ బ్రిటను ఈ సమస్యను బరిష్కరించుకో లేకపోయెను. దీనివలన లాభమటుంచి నష్టమే కలిగినది. మూలధనముపై వచ్చు వడ్డీ యాగిపోయినది. కావున బ్రిటను, మఱియు నార్థిక సంక్షోభముచేఁ దలయెత్తుకోనుటకు శక్తి లేని యితర దేశములన్నియు తమ పరిశ్రమలను బునరుద్ధరించుటకని అమెరికాను అప్పుగా డాలర్లను గోరినవి. 1946 లో అమెరికా ఈ దేశములన్నిఁటికి డాలర్ల అప్పునిచ్చినది. అమెరికా బ్రిటను కప్పిచ్చి, బ్రిటను ఎగుమతి వ్యాపారమువలనఁ బ్రాప్తించు డాలర్లను, ఇతర స్టెర్లింగ్ దేశములకుఁ బంచుట కవకాశము కల్పించినది. ఈ సందర్భముననే కెనడాకూడ బ్రిటనుకు డాలర్ల అప్పునిచ్చినది. దీనివలన బ్రిటను కొంతవఱకు తన యార్థిక సంక్షోభము నరికట్టుకొనఁ గలిగినది. కాని ఈ సమస్య పూర్తిగాఁ బరిష్కారము కాలేకపోయెను. 1949 వ జూన్ వఱకు స్టెర్లింగ్ ప్రాంతములకు నాయకత్వము వహించిన బ్రిటన్ తన పౌను విదేశమూల్యమును మార్చుటకు తయారైనది. 1949 వ సెప్టెంబరున వాషింగ్టనులో బ్రిటను, అమెరికా, కెనడా ఆర్థిక విదేశాంగమంత్రుల సమావేశము జరిగినది. ఈ సమావేశ ముఖ్యోద్దేశము స్టెర్లింగ్ ప్రాంతములలో నేర్పడిన డాలర్లకొఱతను దీర్చుటయే. డాలరకొఱత తీర్చవలయునన్న వ్యాపారశేషము అనుకూలముగ నుండవలయును. దిగుమతులు తక్కువై యెగుమతు లధికము కావలయును. దిగుమతులను సాధ్యమైనంతవఱకు తక్కువ చేసికొని, ఎగుమతులను హెచ్చించుటకు బ్రిటను ఆర్థికమంత్రి క్రిప్సు తమ పౌండు విదేశమూల్యమును తగ్గించుచు నీక్రింది ప్రకటన చేసినాడు.

"We and the sterling countries of the commonwealth like Australia, India and so on, all do a lot of business with the dollar area and pool our dollar earnings. So, though this problem affects the United Kingdom particularly—as bankers for the sterling area—it also affects the whole sterling area, and infact the whole non-dollar world."

క్రిప్సు రేడియోప్రసంగము(Broad cast) చేయుచు "బ్రిటను వ్యాపార మధికముగా స్టెర్లింగ్ ప్రాంతములో జరుగును గాబట్టి మేము డాలర్లనుసంపాదించుటకు "We need to lower the sterling rate of exchange to a new rate which would stop this drain on our reserves" అని అన్నాఁడు. అంతకొక వారము పూర్వము, అనఁగా

13 వ తేదీన అంతర్జాతీయ బ్యాంక్ అధ్యక్షునకుఁ 'బ్లాక్' డాలరు సమస్యా పరిష్కారమునకుఁ జాల ముఖ్యమైన యీ సూచనలు చేసినాఁడు.

"యూరోపు దేశములు తమ యెగుమతి ధరలను డాలరు దేశములకు సాధ్యమైనంత వఱకు నాకర్షణీయముగా నుండునట్లు చేయవలెను. ఈ లక్ష్యములను సాధించుటకు అనేక మార్గములుగలవు. డాలరుకొఱఁతి ననుభవించుచున్న దేశములు అంతర్జాతీయపు అంగడుల (International markets) లోఁ బోటీకి నిలుచుటకు వీలుగా మారకపు విధానమును నిర్ణయింపవలెను. ఈ విధముగా మారకపు ప్రమాణములు (Rates) మార్పు చెందినచో— ఏ దేశపు వస్తువులు చౌకగా లభించునో— ఆ దేశముల నుండియే, అవసరమున్న దేశములు సరకులను దిగుమతి చేసికోఁగలవు. ఇట్టి చర్య తీసికొనుటయందుఁగల సాధక బాధకములనుగాని, యట్టి చర్యవలనఁ గలుగు ఫలితములనుగాని నేను తక్కువచేయుట లేదు. కాని అట్టిచర్య యేవిధముగా నివార్యమగునో నేను గ్రహింపఁజాలకున్నాను."

బ్రిటను తన పౌను విదేశమూల్యమును మార్చినట్లు ప్రభుత్వప్రకటన విని కామన్వెల్తు రాజ్యములన్నియు, ఒక పాకిస్తాను తప్ప, తమతమ నాణెముల మారకపు విలువను తగ్గించుచు నధికారప్రకటన చేసినవి. ఆయా దేశముల నాణెముల మారకపు విలువ ఈ విధముగా నున్నది:—

| వివిధ దేశములు. | ప్రాఁత ప్రమాణము. | క్రొత్త ప్రమాణము. |
|---|---|---|
| బ్రిటను (పౌనుకు డాలరుకు) | 4.03 | 2.80 |
| భారతదేశము (పౌనుకు రూపాయకు) | 4.76 | 3.309 |
| బర్మా | 4.76 | 3.309 |
| న్యూజిలెండు | 4.03 | 2.80 |
| ఐర్‌లెండు | 4.03 | 2.80 |
| ఇస్రేయిల్ | 4.03 | 2.80 |
| ఉత్తరాఫ్రికా | 4.03 | 2.80 |
| ఆస్ట్రేలియా | 3.22 | 2.24 |
| ఈజిప్టు | 4.05 | 2.87 |
| నార్వే | 7.94 | 4.96 |
| డెన్మార్కు | 6.92 | 4.81 |

మన భారతదేశము తన రూపాయి విదేశమూల్యము తగ్గించుట కొందఱభిజ్ఞులకు బాగనుపించలేదు. ఏలన రూపాయి మారకపువిలువ తగ్గించుట అసహజము. కావున వారు "Leave the rupee to find its own level" అని వాదించిరి. రూపాయి ధర తగ్గించుటవలన విదేశీయులకు మన దేశము సరకులు చవుకగా నుండును. స్వదేశమునందు సరకులధరలు హెచ్చును. కార్మికులకు, కూలీలకు వేతనము లధికముచేయ వలసి వచ్చును. దానివలన నుత్పత్తి వ్యయము పెరుగును. ఖర్చులధికమగుట వలన నుత్పత్తులు పడిపోవును. ఆ కారణమున మనము మన రూపాయి మారకపు విలువను ఏ యుద్దేశముతో తగ్గించినామో అది నిష్ఫలమగును. ఉత్పత్తులు పడిపోయినతర్వాత ఎగుమతిచేయుటకు సరిపోవు సరకు మన కెక్కడనుండి లభించును? కావున మఱల పౌనువిలువ తగ్గింపవలసి వచ్చును. దీని కంతుండదు. ప్రొ॥ సి. ఎన్. వకీలు ఈ విధానమును బ్రతిఘటించుచు నీ విధముగా నన్నారు:—

"As we depend on imports from the U. S. A. of food and capital goods, this will have same effect on the internal price-level which will be raised

further in consequence. Our goods will be cheaper in the American market and this may help our exports; but the degree of advantage that we are in a position to get is uncertain as our production is limited. The dollar value of our sterling balances is reduced by 30 percent, and this is a net loss to the extent to which we could have converted the balances into dollars. If Pakistan does not devalue, Pakistan goods will become more expensive to us."

కాని రూపాయిని తన విలువను దానే నిర్ధారణ చేసికొనుటకు వదలివేయుట హానికరము. ఏలయన గత ప్రపంచసంగ్రామ ద్వయ మధ్యకాలములో మారకపు ప్రమాణము (exchange rate) లేక పోవుటచే ననేకార్థిక క్లిష్టసమస్యలు రేకెత్తినవి. అంతర్జాతీయ వ్యాపారము దెబ్బతినినది. నిరుద్యోగ సమస్య చెలరేగినది. 1924 నుండి 1926 వఱకు జరిగిన ఫ్రెంచి ఫ్రాంకు చరిత్రను జదివినచో మన కీసంగతి స్పష్టమగును. మన ప్రధానమంత్రి జవాహరలాల్ నెహ్రూ, పరిశ్రమల మంత్రి డా॥ శ్యామప్రసాదముఖర్జి, వాణిజ్యమంత్రి కే. సి. నియోగి మొదలగు ప్రముఖులు రూపాయి మారకపువిలువ తగ్గింపు కేవల మాత్మరక్షణకొఱకే జరిగినదని, అన్ని సందేహములు దూరమగునట్లు లెక్కల యుక్తముగాఁ బ్రకటించినారు. ఆచర్చలలోఁ బాల్గొనిన మన యార్థికమంత్రి డా॥ జాన్‌మత్తాయి "మార్గాంతరము లేక మేము బ్రిటిషు ప్రభుత్వమునే యనుసరింపవలసి వచ్చినది" అని స్పష్టముగాఁ బ్రకటించినారు.

1900 నుండి 1947 వఱకుఁగూడ మన దిగుమతులకన్న నెగుమతియే యెక్కువగా నుండి యుండెను. కాని దేశవిభజన జరిగినతర్వాత దిగుమతి యెక్కువయును, ఎగుమతి తక్కువయును గాఁ జొచ్చినది. మన దేశముయొక్క అనుకూల వ్యాపార క్షేమము తారుమారై పోయినది. శ్రీ కె. సి. నియోగిగారు దీనికిఁ గారణము చెప్పుచు నీ విధముగా నన్నారు. "1947, ఆగస్టు 15 వ తేదీవఱకు భారతదేశము వ్యవసాయ ప్రధానదేశముగా నుండెడిది. మన యెగుమతి యెచ్చుముగా ముడిపదార్థముల మీఁద నాధారపడి యుండెడిది. దేశ విభజనతో ఈ పరిస్థితి మారిపోయినది. అంతకుఁ బూర్వము మనము ముడిప్రత్తి, జనుము ఎగుమతిద్వారా విదేశ ద్రవ్యమును సంపాదించుకొనుచు వచ్చినాము. దేశవిభజనకుఁ బూర్వము కేవలము దేశీయ వ్యాపారముగా నుండుచు వచ్చిన ముడిప్రత్తి, జనుము వ్యాపారము విభజనానంతరము విదేశవ్యాపారమైపోయినది 1947, ఆగస్టు 15 కు పూర్వముకన్న నిప్పుడు మన మాహార ధాన్యములను జాల ఎక్కువగ దిగుమతి చేసికొనవలసి వచ్చుచున్నది. 1948-49 సంవత్సరములలో మన యెగుమతులకన్న దిగుమతు లెక్కువగ నున్నట్లు ప్రకటించినారు." "1948-49 సంవత్సరములో దాదాపు 130 కోట్ల రూపాయల విలువగల ధాన్యమును దిగుమతి చేసికొనినాము. ఇంతకుఁబూర్వము దేశీయ వ్యాపారముగ నుండుచువచ్చిన ముడిజనుము దిగుమతుల క్రింద ఈ సంవత్సరము 40 కోట్ల రూపాయలు ఖర్చుచేయవలసి వచ్చినది. అట్లే ముడిప్రత్తి దిగుమతులకు దాదాపు 65 కోట్ల రూపాయలు ఖర్చైపోయినవి. కాఁబట్టి మన వ్యాపారములో నేర్పడిన యననుకూలస్థితికి విలాసవస్తువులు విరివిగా దిగుమతి యగుటయే కారణమని యనుకొనుట చాల పొరపాటు" అని వాణిజ్య

మంత్రి యధినివేశ శాసనసభలో వాదించినారు. ఇట్టి పరిస్థితులు మన దేశ వ్యాపారములో నేర్పడినపుడు రూపాయి విలువను తగ్గించుటతప్ప గత్యంతరము లేకుండెను. కావున మన కేంద్రప్రభుత్వము "రూపాయి విలువను ఇతర స్టెర్లింగ్ ప్రాంత దేశముల నాణెముల విలువతోఁబాటు తగ్గించుటకంటె భారత ప్రభుత్వమునకు మార్గాంతరము లేదు. స్టెర్లింగ్ విలువ తగ్గింపఁబడినంతగా రూపాయివిలువ తగ్గింపఁబడకున్నచో, స్టెర్లింగ్ విలువ తగ్గింపువలన నేర్పడిన యసాధారణ పరిస్థితుల నెదుర్కొనుట సాధ్యముకాదు. పౌనువిలువ తగ్గింపుకంటె రూపాయివిలువ నధికముగా తగ్గించినయెడల అవసరవస్తువుల దిగుమతులమితప్రియ మగుటయేకాక పరిమితమైన యెగుమతులవలన వచ్చు రాబడి యింకను తగ్గిపోఁగలదు" అని ప్రకటించినది. రూపాయివిలువ తగ్గింపువలన మనకునష్టము లేదని యార్థికశాఖ యీ క్రింది ప్రకటన మూలమున హామీ యిచ్చినది.

"The Government of India have taken this decision after the most careful consideration of all the factors, and they have no doubt that it will work out in the best interest of the country."

మన ప్రధానమంత్రిసైతము ప్రభుత్వము యొక్క ఈ నిర్ణయము మన శ్రేయస్సుకొఱకే యని రేడియో అభిభాషణము ద్వారా స్పష్టపఱచినారు. వారి యుపన్యాసములోని యొక భాగముమాత్రమిట నుల్లేఖింపఁబడు చున్నది.

"It is true that as a result of the devaluation imports from the hard currency countries will become dearer. But it does not follow and it is absolutely wrong to draw the inference that the general level of prices and consequently the cost of living in this country will go up. The main items which enter into the cost of living index, are essentially of indigenous origin. For those which are imported we depend mostly on the sterling area countries and for these there will be no change in prices."

ఇఁక మనము కొంతవఱకు రూపాయి విలువ తగ్గింపువలనఁ గలుగు మార్పులను గూర్చి విచారింతము. మన రూపాయివిలువ డాలరువిలువలో నూటికి 30.5 తగ్గినది. పౌనువిలువ మార్పువలన బ్రిటను లో కార్మికప్రభుత్వము తన పలుకుబడి ప్రజల నుండి కోల్పోవు సూచన లగుపడుచున్నవి. ఫ్రాన్సులో సామ్యవాద (Socialist) ప్రభుత్వము పోయి మితవాద ప్రభుత్వ మేర్పడినది. ఆర్థిక రంగములో జరుగుచున్నట్టియును, జరుగఁబోవునట్టియును మార్పుల వలన ప్రస్తుతము మన రాజకీయ రంగములో నట్టిమార్పు లేవియుఁ గలుగలేదు. ఇఁక ముందేమి మార్పులు గలుగఁ గలవో కాని మనము రూఢిగాఁ చెప్పలేము.

ప్రభుత్వము అంతర్జాతీయముగా తన రూపాయివిలువను తగ్గించిన నాఁటినుండి పెరుగుచున్న ధరలింకను పెరుగుచున్నవి. ప్రభుత్వము ధరల విజృంభణమును గాంచి వానిని స్థిరపఱుపవలెను. లేనిచో ఆర్థికరంగమందలి యీ యస్వాస్థ్యము రాజకీయ సంఘర్షణలకు దారితీయును. ధరలను స్థిరపఱచినచో మారకపుధరలు వానియంతట యవి స్థిరపడఁగలవు. దానివలన మన యార్థిక మాంద్యము తగ్గును. "No government can stand by and allow this disregard to go unchecked and the Government of India will take all necessary steps to check any such tendency." అని నెహ్రూ పండితుఁ డనినట్లు. ఈ సమస్యా పరిష్కారమున కవరోధము గల్పించుచున్న దుష్టశక్తు లన్నిఁటిని అరికట్టవలయును.

# సాపేక్ష, పరిణామ సూత్రములు

వి. నరసింగరావు బి. యస్ సి. (ప్రథమ)

నేటి ప్రపంచమున మానవ నిత్య జీవితములో విజ్ఞానశాస్త్రము ప్రధానమై పోయినది. మన నిత్యావసరములు సులభముగాఁ బూర్తికావలయునన్న ఈ శాస్త్ర సహాయము వలననే పూర్తికాఁగలవు. గాలిలో, నీటిపై నిర్భయముగాఁ బ్రయాణము చేయుచున్నాము. వివిధరోగములకు వివిధముగా నౌషధములు తయారు చేయుచున్నాము. మానవసృష్టిని గురించి గొప్ప గొప్ప విషయములు తెలిసికొనుచున్నాము. ఇట్టి వానిపై యాజమాన్యము మానవునకు కల్పించినది. కావున నీ శాస్త్రమునుగురించి తెలిసికొనుట ముఖ్యము. ప్రస్తుతము ఈ శాస్త్రములోని రెండు సూత్రములను మాత్రమే చర్చించెదము.

సాపేక్ష సిద్ధాంతములు:-

(Theory of Relativity)

ఆల్బర్టు ఐన్‌స్టీన్ అను యూదజాతికిఁ జెందిన యొక విజ్ఞాన శాస్త్రవేత్త జర్మనీలో నున్నప్పుడు (1915-1917) సాపేక్షసిద్ధాంతమును ప్రపంచము నెదుటఁ బెట్టెను. మొట్ట మొదట ఈ సిద్ధాంతమును అర్థము చేసికొన్నవారు కొందఱుమాత్రమే. ఎందఱో శాస్త్రవేత్తలీ సిద్ధాంతము నవగతము చేసికొనఁజాలక ఇది శాస్త్రవిరుద్ధమనిరి.

కొందఱీ శాస్త్రజ్ఞుఁడు పిచ్చివాఁడని తలఁచిరి. కాని యతఁ డాత్మవిశ్వాసము గల వాఁడు. వీరందఱిని నిర్భయముగా నెదిర్చెను. కాలము ననుసరించి మనుష్యులు మారిరి. వృత్తులు మారెను. కనుక నేటి విజ్ఞాన ప్రపంచము ఈ సిద్ధాంతములోని గొప్పతనమును గ్రహించినది. ఈ సిద్ధాంతము ఇంతకుఁ బూర్వము గల భౌతిక ప్రపంచమును గుఱించి కలిగిన యనుమానములను దీర్చినది. ఇవ్విధముగా ఆల్బర్టు ఐన్‌స్టీన్ నేటి ప్రపంచ విజ్ఞానశాస్త్రవేత్తలలో నొకగొప్పస్థానము నలంకరించెను.

ఈతఁడు పదార్థమును మించినశక్తి ప్రత్యేకముగా లేదని, పదార్థములోనే శక్తి యిమిడియున్నదని తెలిపెను. పదార్థమున్నప్పుడు చలనస్థితిలో నుండునని చలనముతో శక్తి యుత్పన్నమగునని, ఈ శక్తి వలననే యాకర్షణ యేర్పడునని విశదీకరించినాఁడు. కావున చలనము, శక్తి, పదార్థము యొక్క లక్షణములే కాని పదార్థమును మించిన వేఱు రూపములు కావని స్పష్టపఱచెను.

సాపేక్షసిద్ధాంతమునకు "దేశకాలములను" (Space and Time) గూర్చి కొన్ని యభిప్రాయములు ప్రచారములో నుండెను. వస్తువుండుటకు ప్రదేశ మవసరమని, వస్తువు మార్పుచెందుటకుఁ గొంత వ్యవధి (కాలము) పట్టుననియు, కనుక దేశకాలములు తప్పనిసరియని శాస్త్రీయ విజ్ఞానులు తలఁచిరి. కాని యీ సిద్ధాంత నిరూపణము వలనఁ బైని పేర్కొనఁబడిన వివిధములైన పొరపాటులు దూరమైనవి. ఇదే సిద్ధాంతము వలన పదార్థముయొక్క పరిమితిని బట్టి యునికి యేర్పడును, గాని పదార్థము ఉనికి రెండు వేఱువేఱుగా లేవని తెలియు

యున్నది. కావున "దేశము" "కాలము" అనునవి ప్రత్యేకమైన వస్తువులుకావనియు నవి పదార్థముయొక్క కార్యాచరణమును బట్టి ప్రకటిత మగుననియు మనము తెలిసి కొనవలెను.

ఈ విధముగా నీతఁడు నేఁడు గొప్ప మార్పునుదెచ్చి విజ్ఞానశాస్త్రములో నొక క్రొత్తవిషయమును గనిపెట్టినాఁడు.

2. పరిణామ సూత్రము.
(Theory of Evolution)

మన మిఁక వేఱొక శాస్త్రజ్ఞుని పరిశ్రమాఫలితమును గుఱించి చర్చించెదము. చార్లెస్ డార్విన్ అనునొక గొప్ప జీవశాస్త్రజ్ఞుఁడు అయిదు సంవత్సరములవఱకు వివిధదేశములు పర్యటించి జీవశాస్త్ర పరికరములను సేకరించి పరిణామ సూత్రమును ప్రపంచమునకుఁ దెలిపెను. ఈతఁడే తన పరిణామసూత్రముద్వారా జీవ శాస్త్రములోఁ బదార్థ తత్త్వమునకుఁ బునాది వేసెను. జీవము వివిధరూపములు ధరించుటకుఁ బూర్వము లక్షల సంవత్సరముల క్రింద చాల సూక్ష్మదశలో నవతరించి యుండెననియు,జగత్తులో జీవము నివసించుటకు వీలులేనంత యుష్ణముండెననియు, ఈ యుష్ణము క్రమేణ తగ్గుచు బొగ్గు(Corbon) ప్రాణవాయువు (Oxygen), తేమ (Water-Vapour) మఱియు నితర పదార్థములు ఎట్టి యాకస్మిక సంఘటనల వలన నొకచోఁ జేరి ప్రోటొప్లాసమ్ (Proto plasm)అనఁబడు మొదటి జీవపదార్థ విశేషమును సృష్టించినదియు, నాఁటినుండి జీవపదార్థము తన వాతావరణము ననుసరించి యెట్లుమార్పు చెందినదియు సోదాహరణముగా నిరూపించినాఁడు.

పునరుత్పత్తి తత్త్వము (Repro ductive Proccess) జీవస్థితిని బట్టి వేర్వేఱు విధములుగా నుండును. మానవులలోఁగాని జంతువులలోఁగాని పునరుత్పత్తి రెండు విధములు. స్త్రీపురుష వ్యక్తుల కలయిక వలన లైంగిక పునరుత్పత్తి(Sexual Re-production) జరుగును. కొన్ని తరగతులలో స్త్రీపురుష వ్యవస్థలు రెండు నొకేజీవిలో నుండును. ఇంకను అధమతరగతిలో లింగభేదము లేకుండ శరీరవిభజన (Physical division) వలన జరుగును.

డార్విన్ సూత్రములఁబట్టి చూచినచో జీవకార్యమున కత్యంతావసర మయిన వస్తువు, బొగ్గు, బొగ్గుతోఁ గలిసిన రసాయన పదార్థములు (Carbon Compounds) మఱియు వాని రసాయనముల కూడికలే విశ్వములోని మూల ద్రవ్యములు (Elements)

మూల ద్రవ్యములగు బొగ్గు (Corbon), ఆమ్లజని (Oxygen) మఱియు ఉదజని (Hydrogen) వివిధ ప్రమాణములతోఁ గలిసి పలువిధములైన పదార్థములను దయారు చేయుచున్నది. జీవరసాయన శాస్త్రము (Organic Chemistry) సంపూర్ణముగాఁ బైనిఁ జెప్పఁబడిన కొన్ని మూలద్రవ్యములపై నాధారపడి యున్నది. కొన్ని సంవత్సరముల పూర్వము జీవిని జీవావసరములు లేక పరిశోధనాలయములలో రసాయనముగా సాధించుట అసంభవమని శాస్త్రజ్ఞులు చెప్పియుండిరి. కాని హోలర్ (Wholer) అను రసాయన శాస్త్రజ్ఞుఁడు 1828 లో మొట్టమొదట యూరియా (Urea)ను దన పరిశోధనాలయములో జీవావసరము లేకుండ తయారుచేసెను. ఆ తదుపరి ఇతర శాస్త్రజ్ఞులు ఏవిధమైన జీవము నైనను శోధనగొట్టము (Tust - tube) లోఁ దయారు చేయుట సంభవమని దలఁచు

చున్నారు. ఈ విధముగా విజ్ఞాన శాస్త్రము వలన అసంభవమను విషయము లేకుండఁ బోయినది. ఇంతేగాక రానురాను మన విజ్ఞానశాస్త్రజ్ఞులు నూతన ప్రపంచ సృష్టింపఁగలుగుదు రనుటలో సందేహ కనుపించుటలేదు.

స్వామి వివేకానందుఁడు :-

"అహింస మంచిదియే. ఎగ్గుసేయువారి నెదిరింపక సహించుకొనుట గొప్ప మాటయే — ఇవి మహోదారమైన మతసిద్ధాంతములే! కాని "నీవు గృహస్థాశ్రమములో నున్నావు. నిన్నెవఁడైన లెంపకాయ కొట్టినప్పుడు, దానికి సమానమైన ప్రతీకారము చేయనిచో, నీవు నిజముగాఁ బాపము చేసినవాఁడవగుదువు". అని శాస్త్రములు చెప్పుచున్నవి. "నిన్నుఁజంపుట కేవఁడేని వచ్చిన అతఁడు బ్రాహ్మణుఁడైనప్పటికిని అతనిఁ జంపుట పాపముగాదు". అని మనువు చెప్పుచున్నాఁడు. (viii - 350) ఇది పరమ ప్రమాణము. మఱచిపోఁదగిన విషయము కాదు. శూరులే యీ ప్రపంచ సుఖమనుభవింతురు. నీ వీర్యమగపఱచి శత్రుజయ వశీకరణములు సమకూర్చుకొని ఐహిక సుఖము లనుభవించుటకు సందర్భానుసారముగా సామ, దాన, భేద, దండోపాయములను రాజ నీతులు నాల్గును ఉపయోగపఱుపుము. అప్పుడే నీవు ధార్మికుఁడ వగుదువు. అట్లుచేయక యథేచ్ఛముగా నిన్నెవఁడైన వచ్చి తన్ని కాలిక్రిందఁ బెట్టి రాచుచున్నను, ఆ బాధావమానములు ఎఱిఁగి యెఱుఁగనట్లు నోరుమూసికొని భరించియున్నచో, నీబ్రతుకంత నీచపు బ్రతుకు మఱియొకటిలేదు. నీయిహలోక జీవనము కేవలము నిరయమే, నీపరలోక జీవనమును అట్టి నరకమే. ఇట్లు శాస్త్రములు చెప్పుచున్నవి. నీస్వధర్మమును నీవు చేయుము- ఇది పరమ సత్య సిద్ధాంతము. నా మతము వారికి ప్రేమపూర్వకముగానేఁ జేయు హితోపదేశమిది. అట్లని ఎవ్వరికిని కీడు చేయకుఁడు, ఎవ్వరి యెడలను దౌర్జన్యముతోఁ బ్రవర్తింపకుఁడు, శక్త్యనుసారముగాఁ బరోపకారము చేయుటకుఁ బ్రయత్నింపుడు. అంతేకాని పరులు పెట్టుబాధలను పట్టి సబ్బుఁడై భరించి యూరకుండుట గృహస్థునకు పాతకము, తక్షణమే ప్రతీకార ప్రయత్నములు చేయుట అతనికి విధి. గార్హస్థ్యము నందుండువాఁడు కడుశ్రద్ధతో యావచ్ఛక్తి యుపయోగించి ధనము నంపాదించి దానితో స్వకుటుంబమును చక్కఁగాఁ బోషించుకొనుచు, ఇతరులను సుఖపెట్టుచు, సాధ్యమైనంత వఱకు సత్కార్యము లాచరించు చుండవలెను. అదినీవు చేయలేని యెడల మనుష్యుఁడనని యెట్లు చెప్పుకొనఁగలవు! గృహస్థుఁడవైననుగావే! మోక్షము మాట యెట్లెత్తఁ గలవు!"

# ఖానూన్

## కె. వి. నరసింగరావు

పూర్వ విద్యార్థి

(అహమద్ అబ్బాస్ రచనకనువాదము)

"సర్కార్! నాభార్య, బిడ్డా భాగం
'డా ఇప్పించండి"

"వెధవా! అబద్ధమాడు తున్నావు.
ర్య, బిడ్డా ఉన్నట్టయితే వాళ్ళువచ్చి
సక్కోరటా! వాళ్ళేమైన సమగ్రాడి
ల్లో కూర్చున్నారా?"

రాముడు చాల ఆత్మాభిమానము గల
డు. తన భాగమునకు వచ్చిన రెండు
రాలు, నాలుగు పూరీలు తీసికొని
క్కకు తొలగినాడు. "ఇంటిలో
ర్యయు బిడ్డయు తొడిగికొనుటకు గుడ్డలు
ండనున్నారు. ప్రేగులుకట్టుకొనినందున
ము శరీరము కనబడు చున్నది. అందు
వారు బాజారుకు వచ్చుటకు వీలులే"
 చెప్పుటకు రాముని మనస్సొప్పు
నలేదు. ఇంటిలో ఒక్కదోవతి మాత్రి
ండెను. అదితాను కట్టుకొని పనిపాట
నము బాజారుకు పోవుచుండెను. జీతము
రకినరోజు బట్టల కొట్టులన్నియు వెదకి
డు. అయిదేసి రూపాయల కొకదోవతి
రకినచో కొందుమని. ఒకదోవతి కొని
దున ఆ నెల సాంతము ఒకపూట
జనము చేయవలసివచ్చినను ఉద్యుక్తుడై
ండెను. కాని అయిదు రూపాయల
టయటుంచి పాతిక రూపాయలకు కూడ
 దోవతి దొరుకునట్లులేదు. "చాక్"
మన్న ప్రతి చిన్న, పెద్దకొట్లన్నియు
ంచినను గాని యెక్కడ చేజిక్కలే
క్కదోవతి. ఒకవర్తకుడు మాత్రము
మెల్లగా(!) అన్నాడు: "అబ్బాయి! నీకు అంత అవసరముంటే ఒకజోడా సంపాయించి పెడతా. కాని యాభైరూపాయలు ఇవ్వవలసివస్తోంది" ఏబదిరూపాయలు! నెల రోజులు కూలిపనిచేయగా నతనికి దొరుకునవి ఇరువదియైదు రూపాయలు. ఏబది యెక్కడినుండి తేగలడు పాపము!

బోడితలపై రాళ్ళవానవలె, అతడు నౌకరి నుండి యప్పుడే తొలగింపబడినాడు. అమెరికా సైనికుల కొరకు "బారక్సు" తయారగుచుండెను. అక్కడ మన రాముడు పనిచేయుచుండెను. ఈ సైనిక దళములు తిరిగి దేశము వెళ్ళిపోవుచుండెను. అందు కొరకు "బారక్సు" కట్టడము ఆగిపోయినది. లక్షప్రయత్నములొనర్చినాడు. అతనికి పని మాత్రము దొరుకలేదు. పనిలేకుండ నుండుచు నిప్పటికి నెల పదునేను రోజులు కావచ్చినవి - ఇంటిలో రెండురోజులనుండి యుపవాసము కూడను. అతడు ఈ రోజు నిశ్చయము చేసికొన్నాడు, పనియు దొరకనిచో బిచ్చమెత్తుకుందామని. కాని పొద్దుననే చిరాగుద్దీను, ముత్తయ్య ఇద్దరువచ్చి, సిహాత్ సింగు గుత్తేదారుని యింటిలో పూరీలు, లడ్డూలు పంచిపెట్టుచున్నారని చెప్పిపోయినారు. అతడొక్క పరుగులో గుత్తేదారునింటికి పోయివ్రాలినాడు. తలకు నాలుగు పూరీలు, రెండు లడ్డూలు! దేవుడతనిని వెయ్యేండ్లపాటు చల్లగానుండనీ! యుద్ధ

ములో జయముకలిగినదఁట! అందుచేత బీదసాదలకు దానధర్మములు చేయుచున్నారఁట! కాని ముగ్గురి సంసారమునకు నాలుగు పూరీలు, రెండు లడ్డూలు ఏమిసరిపోవును? చివరకు భార్యభాగమైనను దొరకినచో సరి పుచ్చుకొనుటకు వీలుండెను. కాని యామె రానిదేమో ఇక్కడ దొరుకుటకు వీలులేదు. ఏలాగు తీసికొనివచ్చుట? శరీరమును గప్పుకొనుటకు గుడ్డలేవి?

ఇదే విచారించుచు అతఁడు రోడ్డుపై నడచుచున్నాఁడు. భగవంతుఁడు పైనుండి యొక యందమైన దోవతిని జారవిడచినాఁడు—తెలుపు, నలుపు, యెఱుపు రంగులతోఁ గూడుకొనిన గుడ్డయొకటి రాముని నెత్తిపైఁ బడినది. మొదట నతఁడు కొంత భయమునొందెను, ఆశ్చర్యమునకును గురియైనాఁడు. కాని పైకి చూచునరికి ఇంకను అటువంటివే ఎన్నియోగుడ్డలు ఆకాశమున నెగురుచున్నవి - దుకాణముల ముందఱ వ్రేలాడుచున్నవి - స్తంభాలకుఁ గట్టఁబడియున్నవి. ఒక్కటి తక్కువయైనచో నేమి కొంపమునుఁగును? భగవంతుఁడే దయదలఁచి యిచ్చినాఁడనుకొనినాఁడు. రెండు జాముల వేళ దుకాణముల తలుపులు మూసియున్నవి. అక్కడక్కడ నొకటి రెండు గట్టుపుబందులు తప్ప నింకేమియును గనుపించుటలేదు. రాముఁడు తొందర తొందరగా ఆ గుడ్డనుచించి [illegible] గట్టుకొని గబగబ యిల్లు చేరుకొనినాఁడు. ఇఁక నతని భార్యకు, బిడ్డ గుత్తేదారు నింటికిఁబోయి పూరీలు, లడ్డూలు తెచ్చుకొనుట కెట్టి సంశయమును లేదు.

రామునకు ఉన్న బట్టలు సరిపుచ్చుకొను నుపాయము తోచినది. తన దోవతి - అసలది భార్యదే - భార్యకుఁ గట్టుకొనుట కిచ్చినాఁడు. వయసు కూతురును తన చింపిరి గుడ్డలే కాక తల్లిపేగులు కూడ కట్టుకొని శరీరమును గప్పుకొమ్మని చెప్పినాఁడు. తానా రంగుల గుడ్డను లుంగీకట్టుకొనినాఁడు. రాముని నల్లని నున్నని శరీర మా రంగుల బట్టలోఁ జాల సుందరముగాఁ గనఁబడుచుండెను. ముగ్గురును సంతోషముతో బయలుదేరిరి. గుత్తేదారుగారి యింటిలో నింకను పూరీలు లడ్డూలు పంచిపెట్టఁబడుచునే యుండెను. కాని చాల సేపయినందున పూరీలు చల్లబడినవి! లడ్డూల పొడి మాత్రము మిగిలియున్నది. రాముఁడు భార్యకు బిడ్డకు వారి భాగమిప్పించి యొక పూట కడుపునిండ భోజనము చేయవచ్చునను సంతోషముతో బయలుదేరి వచ్చినాఁడు. అదే రోడ్డుపైనుండి పోవుచుండిరి. ఒకకొట్టులోనుండి యొక గర్జనము వినఁబడినది.

"[illegible]! ఆ జండా ఎక్కడ దొంగిలించినావురా?"

"జండా? ఏమి జండా అండీ, నాకేం తెలుసు?"

"ఏ జండా అంటున్నావేం? ఆ లుంగీగా ఏం కట్టుకున్నావ్?"

"ఆఁ...ఇదా?..." రాముఁడు నిర్ఘాంతపడి మఱి మాట్లాడలేక పోయినాఁడు.

"అరే! ఇది మాకొట్టుముందర కట్టిన జండా కదరా! ఎప్పటినుంచి వెతుకుతున్నాం దీనికొఱకు?"

"ఏం షోకుగా కట్టుకున్నాడు!"
"గుంజుకో! వెధవ దగ్గఱ్నుంచి"
"నాలుగు మోదరా!"
"కానిస్టేబుల్ను పిలువు."
"ఏయ్! కానిస్టేబుల్! ఇటురా!"
ఇంక కానిస్టేబులు రాలేదు. ఇంతలో

నొక పోకిరీయువకుఁడు కోపముతోఁ జేయి చాచి లుంగీకొనను బట్టి ఒక్కసారి జాడించి నాఁడు. దానితో బట్టయూడిపోయి రాముఁడు దిగంబరుఁడై నిలఁబడి నాఁడు! భార్య కెవ్వన కేకవేసి సిగ్గుతో మొగము త్రిప్పుకొనినది.

నాలుగు దిక్కులనుండి "హా హ్హా హ్హా అని నవ్వుల వర్షము కురిసినది. రాముఁడు భూమిలోఁ బాతుకొని పోయినట్లు నిలఁబడి పోయినాఁడు.

ఎవరోయొక బాటసారి యీ దృశ్యమును జూడలేక రామునకు తన కండువా నందించినాడు. రామునకుఁ బ్రాణములు లేచివచ్చినవి. కాని ఇంతలో పోలీసులువచ్చి యతని నరెస్టుచేసిరి. చేతులకు బేడీలు తగిలించి తీసుకొని పోవుచుండిరి. వెంట గుంపులు గుంపులు గామంది యూరేగింపు మాదిరి నడచు చుండిరి.

"జండా దొంగ పట్టుపడ్డాడు! జండా దొంగ!!"

అప్పుడే యటువచ్చిన యొక బాటసారి "ఇతన్ని యెందుకు పట్టుక పోతున్నారు? ఇతడేంచేశాడు?" డని సిపాయినడిగెను.

ఆ గుంపులోనుండి యొకతఁడు పెద్ద న్యాయవాదివలె నన్నాఁడు. ఇతను ఒక్క తప్పుచేశాడనా చెప్పుటకు? మూడుతప్పులు చేశాడు మూడు!"

"మూడు నేరాలా! ఏమిటవి?"

"మొదటిది దొంగతనం!"

"మరి రెండోది?"

"రాజపతాకాన్ని అవమానపరచడం"

"మూడోది?"

"మూడో దేమంటే నడిబాజారులో దిగంబరుడుగా నిలబడటం. ఇది గూడా ఖానూనుకు వ్యతిరేకమేనా కాదా!"

ఆ సమయమున నటువంటివే యింకను నూరులకొలఁది జండాలు గాలిలో 'పర్ పర్' మని యెగురు చుండెను — వానినిఁజూచి నవ్వుచున్నట్లుండెను.

"ప్రణవాక్షరము నిత్యము జపించుట వలనను, తన్మంత్రార్థమును ధ్యానించుట వలనను సర్వము సిద్ధించును. 'భగవన్నామోచ్చారణము వలన సమస్త పాపక్షయమగును.' 'ఈశ్వరేచ్ఛయెట్లున్నదో అట్లు జరుగ నిమ్మని అతనిమీఁద భారమువేసి అన్నియు వదలుకొన్నవారికి అన్నియు చేకూరును.' ఔను! శాస్త్రములు, జ్ఞానులుచెప్పిన యీ మాటలు సత్యములు, కాని మనలో వేలకొలఁది జనులు యావజ్జీవనము ప్రణవ ధ్యానము చేయుచుండుట లేదా? భగవన్నామ ముచ్చరించి భక్త్యానంద పరవశు లౌచుండుటలేదా? 'సీయిష్టమెట్లో అట్లే కానిమ్ము తండ్రీ! భారము నీ మీఁదవేసి పూర్తిగా నన్ను నీ కర్పణము జేసికొన్నాను' అని యనుచు చుండుటలేదా? నిజముగా వారి కేమిప్రతిఫలము ముట్టుచున్నది? ఏమియు లేదు! ఎందుచేత? కారణమిది; అది బాగుగాఁ దెలిసికొనవలెను. ఎవరి ధ్యానము నిజమైన ధ్యానము? ఫలకారి? ఎవఁడు సర్వసంగ పరిత్యాగియై సర్వేశ్వరునిచ్ఛకుఁ దన్నుఁదా వదలివేసికొనఁ గలఁడు? ఎవఁడు అనివార్యమైన శక్తితో, పిడుగుపడినట్లు, భగవన్నామము ముచ్చరింపఁ గలఁడు. చిత్తశుద్ధి సంపాదించు కొనినవాఁ డొక్కఁడే! అనగా సత్క్రియాకలాపముచే స్వాంతమును స్వచ్ఛముగాఁ జేసికొన్నవాఁడు, అనఁగా ధార్మికుఁడైనవాఁడు."

# హిందూధర్మ సంస్కరణబిల్లు



ముత్యంరావు, యల్. యల్. బి. (ద్వితీయ).

హిందూ ధర్మశాస్త్రముయొక్క స్వరూపమును బరిశీలించినయెడల, వివిధ యుగములలో దేశమందుద్భవించిన పరిణామముల వలన హిందూసంఘము, దాని సంస్కృతి యే విధముగా మార్పు చెందినదో విశదమగును. హిందూసంఘము అతి ప్రాచీనమైనది. పూర్వకాలములో మన దేశము రాజులచేఁ బాలింపఁబడుచుండెను. ఆ కాలములో వారుపయోగించెడి న్యాయశాస్త్రము ఒక ప్రత్యేక రూపమునఁగాని, లిఖితరూపమునఁ గాని లేకుండెను. అతి ప్రాచీనదశలో వేదములు బోధించెడి ధర్మములే పరమధర్మములుగాఁ బరిగణింపఁబడుటవలన వేదములలోని సూత్రములే న్యాయ పరిపాలనమునకు ముఖ్యాధారములుగా నుండెను. కాని కాలము గడచినకొలది విస్తృతమైన శాస్త్రములయొక్క అవసరము వృద్ధికాఁజొచ్చెను. ఈ యవసరమును గుర్తించి ఆనాఁటి ఋషిపుంగవులు వేదములనే యాధారముగాఁగొని స్మృతులను సృష్టించిరి. వీనిలో మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి పేర్కొనఁదగినవి. ఈ స్మృతులలో నాదేశింపఁబడిన నియమములు మఱియు నీతిసూత్రములు రాజ్యాంగ విషయములలోను, న్యాయ పరిపాలనలోను ఆచరణకు వచ్చెను. ఈ రీతిగా శ్రుతులును, స్మృతులును ధర్మశాస్త్రమున కాదర్శ గ్రంథములుగాఁ బరిణమించి యతి గౌరవస్థానము నాక్రమించినవి. ఈ పరిస్థితులలో హిందూ ధర్మసూత్రములు మార్పు చెందనవనియు, సర్వకాలాచరణ యోగ్యములైనవనియు నను నమ్మకము ధ్రువపడఁజొచ్చెను.

కాని మహమ్మదీయులు హిందూదేశమును వశపఱచుకొనిన తర్వాత ఆనాఁటి క్లిష్టపరిస్థితుల నెదుర్కొనుట కనుకూలమైన మార్పులు ధర్మశాస్త్రములోఁ బ్రవేశపెట్టఁబడినవి. ఉదాహరణముగా నొకటి: బాల్యవివాహ మా రోజులలోనే హిందూ సమాజములో నడుగుపెట్టినది. తర్వాత ఆంగ్లేయుల రాకతో, పాశ్చాత్యుల సంస్కృతీ విజ్ఞాన ప్రభావములవలన హిందూ ధర్మములో ననేకమైన తారుమారులు జరిగినవి. ఆంగ్లేయులు 'విభజించి పాలించు' సిద్ధాంతము ననుసరించి కొన్ని విషయములలో హిందువుల కొఱకు ప్రత్యేక న్యాయశాస్త్రమును సృష్టించిరి. అందులో శ్రుతులను స్మృతులనే మూలములుగాఁ బరిగణించిరి, కాని యాకాలపు టాచార వ్యవహారములకుఁ గూడ నందులో స్థానమిచ్చిరి. కొన్ని దురాచారములను నిర్మూలించు ప్రయత్నములుగూడ జరిపిరి. ౧౮౫౦ లో "కులాసమర్థతా నివారణ చట్టము" (Caste disablities Removal Act) ౧౮౫౬ లో "హిందూ వితంతూ పునర్వివాహ చట్టము" (Hindu Widow's Remarriage Act), అస్పృశ్యతా నిర్మూలన చట్టము మఱియు శారదా బిల్లు వలన

దురాచారములను గొంతవఱకు నిర్మూలింపఁ గలిగిరి.

సంఘములోఁ బాతుకొనిపోయిన యనేక దురాచారములు సంఘ సంస్కర్తలను వేధించుచుండినవి. వారి యసంతృప్తిని దొలఁగించుటకై బ్రిటీషు ప్రభుత్వమువారు బి. యన్. రామారావుగారి యధ్యక్షతన 'రావు కమిటీ' ని నియమించిరి. ఈ కమిటీ దేశపరిస్థితులను సుదీర్ఘముగాఁ బరిశీలించి యొక నివేదికను ప్రభుత్వమువారి కందఁ జేసెను. కాని ప్రభుత్వము తగుశ్రద్ధ చూపలేదు. తర్వాత నవభారత రాజ్యాంగ పరిషత్తులో, ఈ నివేదికనే యాధారముగాఁ జేసికొని డా॥ అంబేడ్కర్ ఒక బిల్లును ప్రతిపాదించెను. దీనినే "హిందూ ధర్మ సంస్కరణబిల్లు" (Hindu Code Bill) అని యందురు. ఒక ఉపసంఘముద్వారా యీ బిల్లులో కొన్ని సవరణలు చేయఁబడిన తర్వాత పరిషత్తులోఁ జర్చింపఁబడెను. అనేక వాదోపవాదములుగూడ జరిగినవి. తుదకు బిల్లును మఱికొన్ని సవరణలకై 'సెలక్టు కమిటీ' లోఁ బెట్టిరి. ఇప్పుడిది 'సెలెక్టుకమిటీ'వారి యాలోచనలోనున్నది. భారత మహిళలు తమ సర్వశక్తులతో ఈ బిల్లును సమర్థించుచున్నారు. స్త్రీల ప్రతి సమావేశములో హిందూధర్మ సంస్కరణ బిల్లును సమర్థించుచు తీర్మానింపఁబడుచున్నది. ఇటీవల జరిగిన హైదరాబాదు మహిళాసమావేశములోఁగూడ నీవిధముగానే తీర్మానించిరి. ఇంకొకవైపు కొందఱు దీనిని తీవ్రముగా వ్యతిరేకించుచున్నారు. ఇది హిందూసమాజమును కేమాత్రము నుపకరింపదని ఉద్ఘాటించుచున్నారు. ప్రభుత్వము ప్రజల మతసంబంధ విషయములలో జోక్యము కలిగించుకొనుట యనుచితమని వాదించుచున్నారు. కావున ఈసమస్య యొక్క యావశ్యకతను గుర్తించి తగు మార్గము నన్వేషించుట యందఱి కర్తవ్యమై యున్నది.

ఈ కాలములో న్యాయశాస్త్రవేత్తలందఱును, న్యాయశాస్త్రమును సులభతరముగాను, లౌకికముగాను, సయుక్తికముగాను సిద్ధముచేయుట మంచిదని చెప్పుచున్నారు. ఒకే న్యాయశాస్త్రము ప్రతి వ్యక్తికొఱకును, కుల మత స్త్రీ పురుష భేదములు, వర్గ వ్యత్యాసములు లేకుండ సమముగా వర్తింపవలెనని వారి వాదన. ఈసిద్ధాంతమున కనుగుణముగా ఈబిల్లులో ననేక విశేషములుగలవు. ఈబిల్లుద్వారా హిందూసమాజములో రెండు గొప్ప సంస్కారముల కాస్కారము కలదు. మొదటిది, కుల మత విభేదములను రూపుమాపుట; రెండవది. స్త్రీ పురుషులకు సమానాధికారముల నొసఁగుట.

ధర్మశాస్త్రములో స్త్రీల వారసత్వపు హక్కులు అతి స్వల్పమైనవి. అవికూడ కఠిన నిబంధనలకు లోనైనవి. తండ్రి యాస్తిలోఁ గూతురుకి భాగములేదు. కాని యామె వివాహాదిబాధ్యతలు తండ్రిపైననో లేక తండ్రి వారసునిపైననో యుండును. కాని కొన్ని యసాధారణ పరిస్థితులలోఁ దల్లిదండ్రులు మరణించి, వారికి వేరే మగ వారసులు లేనపుడు కూతురు తండ్రి ఆస్తికి అర్హురాలగును. ఆ యాస్తిలోఁ గూడ నామెకు పరిమితమైన హక్కులుండును. వివాహమైనతర్వాత కూతురు తన పుట్టింటి సంబంధమును వదలుకొని భర్త యిల్లు చేరును. అప్పుడామెను పోషించు బాధ్యత భర్తపై నుండును. భర్త యున్నంతవఱకు నామెకు భర్త యాస్తియందెట్టి యధికార

మును ఉండదు. భర్త మరణించినతర్వాత గూడ భర్తయాస్తిలోఁ దనకుఁదగిన పోషణావసరముల వఱకే హక్కుండును. కాని తనకు పుత్రసంతానము లేనియెడల భర్తయాస్తిపై విధవకు పరిమితమైన యధికార మేర్పడును. వితంతువు తన జీవితకాలము నంతయు భర్తయాస్తియొక్క ఆర్జితమునే ఉపయోగింపవచ్చును. కాని అందులో నేవిధమైన మార్పులును జేయఁజాలదు. ఆమె మరణానంతర మాయాస్తి యామె భర్తయొక్క మగవారసులకే చెందును.

ఈ బిల్లులో ఈ యవరోధములు తొలఁగింపఁబడి స్త్రీలకు మగవారితో సమానముగా తండ్రియాస్తిలో హక్కు కలిగింపఁబడినది. ఆమె తనవంతు ఆస్తిపై సర్వాధికారమును గలిగియుండును. కాని దీనివలన నామె పెండ్లియయినపై తండ్రి బాధ్యత సన్నగిల్లును. తనయాస్తిని సరిచూచుకొనుటకుఁ దగిన తెలివితేటలు వారు కలిగియుండవలయును. ఆస్తి పంపకము విషయములో నేవిధముగా నన్నదమ్ములలో విరోధములు ప్రబలుచున్నవో, యిఁకముందు అక్క చెల్లెండ్రుగూడ విరోధములకుఁ గారకులగుదురు. కుటుంబములోనున్న పరస్పర ప్రేమభావము లడుగంటి వికృత సంబంధము లేర్పడును. ఆస్తియొక్క భాగము లధికమగుటచే నెన్నియో ఆర్థిక సంకటము లేర్పడును. వివాహానంతరము తన యాస్తితో నుండుటకన్న నెక్కువగా భర్తతో నుండవలసి వచ్చును. అప్పుడాస్తిని భరించుట కష్టమైపోవును. ఇప్పుడున్నట్లు గాక తండ్రి చనిపోయినతర్వాత స్త్రీలకు తమ వివాహ బాధ్యత తమపైననే పడును.

బిల్లులోఁ జేర్పఁబడిన సవరణలు చాలవఱకు నభ్యుదయ దోహదములుగా నున్నవి. అంతర్వర్ణ వివాహములను, శాస్త్రీయముగా ఒప్పుకొనునట్లు చేయఁబడి ప్రతి యువతీ యువకులకు జరిగిన సంస్కార పూరితమైన, సభ్యతాయుతమైన వివాహమును ఈ బిల్లు సరియైనదిగా గుర్తించుట కంగీకరించును. ఇది సంఘములో నత్యవసరమైన సవరణ. జాతి మత విభేదాలతోఁ గృశించుచున్న హిందూ సంఘమున కిది నవజీవనము నిచ్చును. బహు భార్యాత్వమును ఈబిల్లు రద్దుపఱచుచు నిర్దేశముగా నొక స్త్రీకి యొకే భర్తయను నిర్బంధము కూడఁ బెట్టుచున్నది. ఇది యెంతయైన నవసరమనుటలో సందేహములేదు.

ప్రస్తుతము హిందూసంఘమున వివాహమును రద్దుపఱచుటకు వీలు లేదు. భార్యాభర్తలమధ్య యెంత యసంతృప్తి యున్నను ఆ భర్త యాభార్యతోనే, యాభార్య ఆ భర్తతోనే యుండవలసి వచ్చుచున్నది. హిందూ సంఘములోఁ బ్రప్రథమముగా భార్యాభర్తలు తమ వివాహమును విడాకులద్వారా రద్దుపఱచుకొనుటకు ఈ బిల్లు సమ్మతించుచున్నది. ఈ సంస్కరణ మూలమున నపూర్వమైనమార్పువచ్చును. వివాహ జీవితములో నాదినుండి కలిగిన నిర్బంధములు తొలఁగిపోఁగలవు.

ఈ బిల్లుద్వారా హిందూ సమిష్టి కుటుంబములోనిమూలసూత్రముబొత్తిగాఁ దిరస్కరింపఁ బడినది. ఇంతేకాక ధర్మశాస్త్రములోఁ బుత్రునకుఁ దండ్రిచేసిన ధర్మము లపవిత్రములని యెంచఁబడును. ఈ బిల్లుద్వారా ఇటువంటి బాధ్యతలనుండి పుత్రుని విముక్తునిగాఁ జేయ నుద్దేశింపఁ బడినది. ఈ కాలము లోని హిందూస్త్రీలకు దత్తునిచ్చు నధికారముగాని, దత్తుచేసికొను నధికారముగాని లేదు. ఈ బిల్లు స్త్రీలకు

దత్తు విషయమైన పై హక్కుల నిచ్చును. సవర్ణేతరులను దత్తు చేసికొనుట చట్టరీత్యా అంగీకరింపబడ వలయునని యీ బిల్లు ఉద్దేశము.

కొందఱు చేసెడి నిశిత విమర్శలను, మూఢవ్యతిరేకములను పాటింపక దీనిలో సూచింపబడిన మార్పులను సత్వరముగా నమలులోఁ బెట్టినచో హిందూజీవిత విధానములో నవశకారంభము కాఁగలదనుట నిర్వివాదాంశము. చాల కాలమునుండి యెన్నియో దురాచారములవలన హిందూ సంఘము క్షీణించుచు వచ్చినది. ఇప్పుడీ ప్రాచీన సంఘాచారములలోఁ గ్రొత్త విషయములు ప్రవేశించుట శుభ సూచకము. ఇపుడున్న బిల్లురూపములోఁ గొన్ని సవరణలుచేసి తగిన చేయూఁత నొసఁగుట ప్రభుత్వ కర్తవ్యము. ఉపయోగకరమలైన విమర్శలచేతఁ దగు సవరణలు వచ్చునట్లు చేయుట ప్రజల కర్తవ్యము. అట్లు చేసినపుడే క్రొత్త ప్రాత సద్ధర్మముల సంయోగమును బొంది హిందూ జీవన విధానము, పవిత్రమైన గంగా యమునా స్రవంతివలె తిరిగి భాసిల్లగలదు.



స్వామి వివేకానందుఁడు :—

"ముక్తియన నేమి? ఈలోకములో సుఖముకూడ దాస్యమే. అట్లే పరలోకసుఖము. ఏలనఁగా ఈ లోకము గాని యితర లోకములుగాని ప్రకృతిశాసనముల నుల్లంఘించి యుండలేవు. అన్నియుఁ బ్రకృతినియమ బద్ధములే! ఇనుప సంకెలలకును, హేమశృంఖలలకును ఉండుభేదమే యిహలోక దాస్యమునకును, పరలోక దాస్యమునకును ఉండు భేదము......... ప్రజలందఱు మోక్షమార్గ మవలంబించి యాచరించినచో నది సర్వోత్తమమే! కాని యెట్లు సాధ్యమగును? భోగానుభవము లేకుండ భోగపరిత్యాగ మెన్నడును రాదు. మొదట సుఖ మనుభవింపుము. తర్వాత దానిని వర్జింపవచ్చును. అట్లుగాక దేశీయులందఱు నాకస్మికముగా సన్యాస స్వీకారము చేసినచో, కావలసినది రాకపోవుటయే కాక, యిదివఱకున్నది కూడ యెగిరిపోవును. చేతిలోనున్న పక్షి చేయిదాఁటి పాఱిపోవును. చెట్టు మీఁదనున్న పిట్ట పట్టువడదు...............మోక్షము ధర్మముకంటె ఎక్కువ, నిజమే, కాని మొట్టమొదట ధర్మము తప్పక నెఱవేర్చుకో వలెను."

# స్వప్నసుందరికి

ఓం. రఘునాథరాజు, (బి. ఎ. ద్వితీయ)

[ ఒకనాఁటికేయి పరిచితయు నపరిచితయుఁగాని యొకానొక సుందరిని స్వప్నమునఁగాంచి యా మఱునటిదినమే యా స్వప్నదృశ్యము ప్రత్యక్షముగాఁ బొడకట్ట నా సుందరి, నుద్దేశించి వ్రాయఁబడినవి. ]

చెలియరో! ఒకనాఁటి నిశీథమందు
భావజగమునఁ దిరుగుచుఁ బండుకొంటి
నిదుర పట్టినదియుఁ బట్టనిదియు నెఱుఁగఁ
గనులుమాత్రము మూసితిఁ, గాని కాన
వచ్చుచుండె నంతయు: నద్ది స్వప్నమేమొ? ౧

ఒక టాంగాపయి మాతృయుక్తవయి నీ వొక్కర్తివే యేటికో
నికటస్థానము పోవుచున్నటులు, నే నిన్నప్డు వెన్నాడి న
ట్లు కనన్వచ్చెను— అంతనే యెవఁడో మేల్కొల్పెన్ నసన్ దాన న
న్నకటా! నాకమునుండి ఘోర నరకానం ద్రోసినట్లయ్యెఁ బో! ౨

తెలివిరాఁగనె యయ్యది కలయొ భ్రమయొ?
యనుచు నామది తత్తరమంది కోరెఁ—
గలయె యైన నతంబు నాకలనె కనఁగ
భ్రమయె యైన నతం బట్లె భ్రమసి యుండ. ౩

ఎన్నియోసార్లు నీవున్న యింటిచుట్టు
తిరిగినం గాని నీ చూపు దొరకఁబోదు
చుక్క తెగినట్టు లెప్పుడో యొక్కసారి
కానుపించుటె యెంతయో కష్టమగును. ౪

అట్టిదానిని స్వప్నమందైనఁ గనుల
కరువు తీరఁగఁ గాంచు భాగ్యంబు కలిగె
ననుచు నే నమితానంద మందుచుండ
స్వప్న భంగంబుగావించె జడుఁడొకండు. ౫

స్వప్నమే కాని నిజమైన సంఘటనము
కన్న నెంతయు నాహ్లాదకరముగాఁగ
హృదయగోచరమయ్యె— నూహింపరాదు
పిచ్చికలలందు నెంతో తీపిదనముండు. ౬

పొందరానట్టి ఫలములు పొందనగును
అందరానట్టి వస్తువు లన్ని దొరుకు
సాధ్యములుగాని కార్యముల్ సంఘటించు
చాల సుందరమైన దీ స్వప్నజగతి ! ౭

కల గాంచిన క్షణకాలం
బలఘు ముదంబందియును, దదానందము కే
వల తాత్కాలికమని లోఁ
దలఁచుచు వేమఱచి పోతి తత్స్వప్నంబున్. ౮

* * *

అంతటిలోఁ బోయినచో
నెంతయు బాగుండు— కాని యేమందును నా
స్వాంతమున కద్భుతము గా
నంతయు జరిగినది స్వప్నమందుఁగనినటుల్. ౯

* * *

ఆ కల గాంచినట్టి దినమందున నే నెటో పోవు చుండఁగా
నీ కమనీయవిగ్రహము నీ ప్రహసన్ముఖ చంద్రబింబమున్
నా కనులారఁ గాంచితిని, నమ్ముము ! నేఁ గలయందుఁ జూచిన
ట్లే కనుపించితీవు— అదియే శకటం బదియే స్వరూపమున్. ౧౦

ఆ కూర్చుండుట యదియే !
ఆ కలకలలాడు మొగము నదియే సుమి!! నీ
కోకయు నదియే!!! నీలో
నా కలలో నున్న యామె యామెయె సుమ్మీ!!!! ౧౧

అనవరత తావకధ్యానమున మదీయ
హృదయచిత్రిత తత్స్వప్నదృశ్య మభ్ర
దర్పణంబునఁ బ్రతిబింబిత మగుచుంట
లేదు గదయని మదిని గలిగె భ్రమంబు
కలలు నిజమౌట యెక్కడఁ గాంచలేను. ౧౨

కాని బాజారులోని యా కలకలంబు
గాంచి యయ్యది భ్రమ గాదటంచు నిశ్చ
యంబు గలిగిన తోడనే యలముకొనియె
వింత కోర్కెలు నా మనో వీథియందు ౧౩

స్వప్నమునఁ గాంచినట్టి దృశ్యంబు తిరిగి
కనులముందుఁ బ్రత్యక్షమై కానుపించి
ఒక్క యువకవి భావాల నడుకుసేసె
నన్ను నాశ్చర్యమేమైన నున్నె చెప్పుమ ! ౧౪

వయసా? కొంటెది— భావమా? కవిది— నీవా? నేఁ గలంగన్న క
న్నియరత్నంబవు— వేళయా? పరిమళాన్విత ప్రిమందానిలా
శ్రియ సాయంసమయంబు— అందునను వాసంతంబు— ఇట్లుండ నా
క్రియ నాలోపలఁ గొంటె భావములు రేకెత్తంగఁ దప్పౌనటే ? ౧౫

రూపురేఖల యాశలు చూపి నీవు
చూపు గాలంబు నా మనస్సునకుఁ గ్రుచ్చి
లాగికొంటివి బోయవిలాగు నీవు !
చక్కఁగా నాటు మీ కటాక్షములు నిజము !! ౧౬

అవ్విధి దొంగిలింపఁబడినట్టి మనస్సు వహించి యెంతయో
నివ్వెరపాటుచెంది యట నిల్చితి— వెంటనె తెప్పరిల్లి నే
రవ్వున 'సైకు' పై ననుసరించితిఁ; గాని ఫలంబదేమి? నీ
వవ్వల దాటి పోయితివి— అందక పోయితి వెందుఁబోయితో? ౧౭

తిరిగినచోటే మఱిమఱి
తిరిగితి జను లెల్ల నవ్వఁ, దిరుగని చోటే
యెఱుఁగను నేనా దినమునఁ
బరుపిడితిని వీథులందు బాజార్లందున్. ౧౮

కాని నీవేగు జాడయే కానలేక
విసిగి వేసారి చేతులు పిసికికొనుచు
నన్ను నేఁ దిట్టికొంటిని నిన్నుఁ జేతు
లార విడిచిన నా తెల్వి యాఱిపోను ! ౧౯

అందరానట్టి పండున కాశయేల ?
యని యెఱింగియు నాకింక నాశపోదు!
అపహృతంబైన నా హృదయంబు కొఱకు
పరితపింతును— పొందెడి భాగ్యమేది ? ౨౦

నా యవస్థను జూచి కొందఱు మదీయ
హితులు నను బిచ్చివానిఁగా నెంత్రు— వారు
పిచ్చివారయి నాదియౌ పిచ్చియందు
రనుభవింపని దే తెలియంగ నగునె ? ౨౧



# ప్రాచీనాంధ్రుల సముద్ర వాణిజ్యము

వెల్దుర్తి రామకృష్ణరావు, బి. ఎ. (ద్వితీయ)

ప్రాచీన కాలమునుండియు నాంధ్రులు ప్రజ్ఞావంతులై సాహసిక జీవనమునం దభిలాష గలిగియుండిరి. వారి సంస్కృతి యావద్భారతీయాభ్యుదయమునకు సహాయభూతమై యుండెను. కాని కొంతకాలము నుండి యాంధ్రులు తమ జాతి పూర్వ చారిత్రమును విస్మరించియున్నారు. ఇదికడు శోచనీయమైన విషయము. ఏలయనఁ జారిత్రిక జ్ఞానములేని జాతికి నైతిక మోక్షము మఱియు స్వాతంత్ర్యము లేదు. ఐహిక సుఖానంద మెన్నటికినిఁ జేకూరదు. పూర్వ యుగమందు విరాజిల్లిన కాంతులన్నియుఁ జరిత్రరూపమున జాతికెట్టుట మోపినప్పుడుగాని పురోభివృద్ధికి మార్గము కానరాదు. ఆ పూర్వుల సాహసాభినివేశ శౌర్యకృత్యములు స్మరించినప్పుడు గాని జాతికి మఱల కార్యతత్పరత్వమును, అభ్యుదయమును జేకూరదు.

ఆంధ్రదేశము నైసర్గిక పరిస్థితులచేత తూర్పుతీరమున సముద్రమునంటి, గోదావర్యాది ముఖద్వారములందు సహజముగ నేర్పడిన నౌకాశ్రయములచే శోభాయమానమగుచు నన్యదేశాభిగమనమునకుఁ బ్రోత్సహించుచు వచ్చెను. ఆంధ్రుల సాహసిక జీవనమును, ప్రతిభయును బౌద్ధమత విజృంభణ కాలమున వికసించెను. ఆ విధముగ వికసించిన సాహసిక జీవనోద్యమము కొంతకాలమునకు భారతదేశ నాగరకతా సాంప్రదాయముల వ్యాప్తికే కాక ప్రపంచ చరిత్రమునందు నయిత మౌన్నత్యము వహించినది.

ఆంధ్రులు హిందూ మహాసముద్రమంతయు విహరించి పశ్చిమమున రోము దేశము మొదలుకొని దక్షిణమున నాఫ్రికా (Africa) సమీపముననున్న మెడగాస్కర్ (Medgascar) ద్వీపమునుండి తూర్పు చీనా జపాను దేశముల వఱకుఁగల దేశములతోడను, ద్వీపములతోడను సముద్ర వాణిజ్యము నెఱపి భారత దేశమునకు మహదైశ్వర్యము జేకూర్చిరి. సముద్రములమీఁద తేఁబడినట్టి సరకులలో వర్తకుఁడు తన కిష్టమువచ్చిన సరకును దీసికొని మిగిలిన వానిపై నూటికిఁ బదింటిచొప్పున రేవుకి సుంకము కట్టవలయునని బోధాయనుఁడు (ఆంధ్రపిత యనఁబడు నాపస్తంబునికిఁ బూర్వికుఁడు) శాసించెను. దీనివలన నాపస్తంబ బోధాయనుల కాలమున సముద్రయానము, వాణిజ్యము విశేషముగ సాగుచుండినటుల తెలియుచున్నది. ఈ పురాణ గాథల సారాంశ మేదైయుండినను ఆంధ్రదేశమున మూఁడు సుప్రసిద్ధములగు రేవు పట్టణముల నామములు మాత్రము తెలియ నగును. వర్తకమునకును, సముద్రయానమునకును మిగుల ననుకూలములైన నౌకాశ్రయములు గోదావరి, కృష్ణ, పినాకిని, వంశధార మున్నగు మహానదుల ముఖద్వారములందు వర్ధిల్లియుండెను. గోదావరి కుత్తరమున నుండిన యాంధ్రదేశమునకుఁ

గళింగమని ప్రాచీనకాలమున నామాంతరము గలదు. కళింగ దేశమునకు రాజధానిగ నుండిన దంతపురము గొప్ప నౌకాశ్రయమై యుండెను. ఇన్ని రేవుపట్టణములు వర్తక కేంద్రములు గలిగి యాంధ్రదేశము విదేశములతో వర్తకము సాగించుచుండెను. ఆ కాలమున గంగానదీ ముఖద్వారమునం దుండిన తామ్రలిప్తి నగరమునుండి పశ్చిమ తీరమున భరుకచ్ఛ (బ్రోచ్) సోపార (సూరత్) కుఁ బోవుటకు బాహాటమైన సముద్రమార్గము లుండెను. ఈ నౌకాశ్రయములు ఆంధ్ర చక్రవర్తుల కాలమున నుచ్ఛదశలో నుండెను. ఓడలు తిరిగి తూర్పుతీరము వెంబడిఁ వచ్చి కళింగ దేశమందలి రేవుపట్టణములను, చోళమండలము లోని కావేరిపట్టణమును, కాల్పట్టణమును జూచుకొని సింహళమును జుట్టి సోపార (సూరత్) నగరమునకుఁ బోవుచుండెను.

అజంతా, అమరావతి, కన్హేరి గుహాలయములందలి చిత్రములు కొన్ని విదేశములతోడి వర్తక సంబంధమును, సముద్రయానమును బ్రతిబింబింపఁ జేయుచున్నవి. ఆ కాలపు టాంధ్రుల నౌకానిర్మాణ కుశలత, సముద్రవాణిజ్య వైభవము, చిత్రకళలందు మూర్తీభవించి కాలగర్భమున జీర్ణించక నేఁటివఱకు జీవించియుండి యవ్యక్తముగ నైన నాకాలపు నౌన్నత్యమును దెలుపుచున్నవి. పురాణగాథలందు, గ్రంథములందు రత్న, గజ, అశ్వ పరీక్షాది విషయములు రాజ్యాంగనీతి, మున్నగు వానితోఁబాటు నౌకానిర్మాణ శాస్త్రము కూడఁ జేర్పఁబడి యున్నవి. సముద్రము మీఁద ప్రత్యేకముగఁ బ్రయాణము చేయుటకు నిర్మింపఁబడిన యోడల యడుగు భాగమునందలి చెక్కల నొకదాని కొకటి యతికించునపు డినుపశేకుల నుపయోగింపరాదనియు, నట్లుపయోగించినచో నా యోడలు సముద్రమధ్యమున నుండు నయస్కాంతపు శిలలచే నాకర్షింపఁబడి బద్దలై పోవునని కూడ తెలుపఁబడి యున్నది.

శ్లో॥ న సింధు గాద్యార్హతి లోహబంధమ్।
తల్లోహకాంతై ర్హ్రియతేహి లోహమ్।
విపద్యతే తేన జలేషు నౌకా।
గుణేన బంధమ్ నిజగాద భోజః॥

(యుక్తి కల్పతరువు)

ఇదియునుగాక క్రీస్తుశకము రెండవ శతాబ్దమునాఁటి యజ్ఞశ్రీ శాతకర్ణి మహారాజుచే తన నాణెములపై ముద్రింపఁబడిన యోడ ప్రతిమలను సుప్రసిద్ధ చరిత్రకారులగు విన్సెంట్ స్మిత్ గారు పరిశీలించి యాంధ్రులు సముద్రయానమును గూర్చి యనుభవజ్ఞాన కౌశల్యములను గలిగియుండిరని తెల్పిరి. క్రీ.శ. 77వ కాలమున నాంధ్ర మహాసామ్రాజ్యముతో రోమక సామ్రాజ్యము "క్లాడియన్" చక్రవర్తి కాలమున వర్తక మారంభించెను. ఈ వర్తక మాంధ్రచక్రవర్తుల ప్రాపకపోషణములక్రింద నభివృద్ధి గాంచినది, కావున రోమకనాణెము లీ ప్రాంతమున విరివిగ దొరికెను. నానాటికి మహైశ్వర్యము నొందుచుండిన యాంధ్ర సామ్రాజ్యమున జనసంఖ్య యభివృద్ధి నొందుకొలఁది ప్రజలయందు వాణిజ్యాభిరుచియు, విదేశగమనాభిలాషయుఁ బెరుగఁజొచ్చెను. అట్లు వాణిజ్యాభివృద్ధికై జనులందు గలిగిన విదేశగమనాభిలాష విదేశములందు వలసలను నెలకొల్పుటకుఁ బ్రోత్సహించి యుండెను. ఆంధ్రులందా కాలమున నావిర్భవించిన యాశయము లన్నియుఁ గార్యరూపమున బుప్పించి ఫలించుచుండ మతబోధకులు

మత వ్యాపనార్థము, విదేశముల కరుగుచు నచ్చటి జనులను నాగరకులను జేయుచుండిరి.

క్రీస్తుశకారంభ కాలముననే ప్రారంభమై యభివృద్ధి గాంచినట్టి యాంధ్రుల యధినివేశ సంస్థాపనోద్యమమును, సముద్ర వాణిజ్య వైభవమును భారతీయేతిహాసమున కంతకు జగజ్జేగీయ మానములైన కీర్తిని సమకూర్చిన మహాకార్యములై విరాజిల్లినవి. ఇట్టిఘనకార్యములు తొలుత మన పూర్వులే నిర్వహించిరని తెలిసికొనుట యెంతయు నుత్సాహ జనకమే! కాని కాలానుగుణముగా రాజుల ప్రోత్సాహములేని కతనను, వర్తకుల కభయమిచ్చువారు లేకపోవుట చేతను సుప్రసిద్ధ నౌకాశ్రేయములును, వర్తకస్థానము లన్నియును రూపుమాసెను. తిరిగి పదియవ శతాబ్దారంభమునుండి యా దేశమునఁ బరిస్థితులు మార్పుచెందెనని నుడువవచ్చును. ఆ కాలమున వలసస్థానములు గావింపకపోయినను, జను లుత్సాహముతో చీనా, జపాను, సయాం, బర్మా, కాంబోడియా, పరాసు దేశీయులతోడను, ప్రాగ్ద్వీపముల తోడను వాణిజ్యము మరల సాగించియుండిరి. అంత వఱకు జీవకళ దొఱగియున్న మోటుపల్లి కాకతీయ చక్రవర్తియగు గణపతిదేవుని (క్రీ. శ. 1199-1260) కాలమున రేవు పట్టణమని ప్రసిద్ధికెక్కుటయే కాక తిరిగి వర్తకలక్ష్మికి కాలపట్టయ్యెను. ఈ మోటుపల్లి ప్రాంతమంతయుఁ బ్రాచీన కాలమునుండియు మిక్కిలి నున్నితములయిన రవ సెల్లాలకుఁ బ్రసిద్ధియని పదునొకండవ శతాబ్ద ప్రారంభమున 'మూలియో' మను పరబ్బీ వర్తకుఁడు మిగులఁ బ్రశంసించి యున్నాఁడు.

విజయనగర సామ్రాజ్యపు రెండవ హరిహరరాయల మరణానంతరము సుమారు (1421) కాలమున నాంధ్రదేశమున విదేశములతోడి వ్యాపారము, సముద్రముమీఁద జరుగుచుండినటుల శ్రీనాథ కవిసార్వభౌము కృతముగు "హరవిలాసము" వలనఁ దెలియనగును. వేము భూపాలుని కొలువున సుగంధభాండాగారాధ్యక్షుఁడును, హరవిలాస కృతిపతియు నగు నవచి తిప్పయసెట్టి వంశాభివర్ణనము చేయు సందర్భమున నవచి వంశమువారి విదేశ వ్యాపారమును, మనోహరముగ వర్ణించి యున్నాఁడు. ఈ తిప్పయసెట్టికి, చామిసెట్టి, తిరుమలసెట్టి యను నిరువురు సోదరులుండిరి. వీరు సముద్రప్రయాణము చేయుచు నానా దేశ ద్వీపాంతరములకుఁ బోయి కర్పూర పాదపములు, బంగారు మొలకలు, ఆణిముత్యములు, కస్తూరికా టంకములు, చీని చీనాంబరములు, గంధసింధురములు మొదలగువాని నాంధ్రదేశమునకుఁ గొనివచ్చుచుండెడివారు. శ్రీనాథుఁ డీ విషయముల నీక్రింది పద్యములం దతి మనోహరముగ వర్ణించి యున్నాఁడు.

"సీ॥ పంజాబుకర్పూర పాదపంబులు తెచ్చి
జలనోగి బంగారు మొలకదెచ్చి
సింహళంబున గంధ సింధురంబులుదెచ్చి
హురుమంజి బలుతేజి హరులుదెచ్చి
గోవసంశుద్ధ సంకుమద ద్రవ్యము తెచ్చి
యాపగ నాణిముత్యాలు దెచ్చి
బోటంగి కస్తూరి కాటంకములు తెచ్చి
చీని చీనాంబరశ్రేణిఁ దెచ్చి

గీ॥ జగద గోపాలరాయ వేశ్యా భుజంగ
వల్లభాదిత్య ధూదాన పరశురామ
కొమరగిరిరాయ దేవేంద్రు కూర్మి హితుఁడు
జాణ జగజెట్టి దేవయ చామిసెట్టి."

విజయనగర రాజ్యమునకుఁ గళ్ళికోట ప్రధానమగు రేవునగరముగ నుండుట తటస్థించినందున విజయనగర సామ్రాజ్య మభివృద్ధిఁజెందు కొలఁది కళ్ళికోట రేవుగూడ నభివృద్ధిలోనికి వచ్చియుండెను. సామ్రాజ్యము నందలి వర్తకమంతయుఁ బ్రత్యేకముగ నీ రేవుపట్టణపు వర్తకులచేతిలోనుండుటవలన నా నగరపుటైశ్వర్యము పాశ్చాత్యులకు వెఱపును, ఆశ్చర్యమును గలిగించియుండెను. అట్టి వైభవమును జూచి క్రీ. శ. 1442 సంవత్సరమున విజయనగర చక్రవర్తులకడకు పారశీకమునుండి రాయబారిగావచ్చిన అబ్దుల్‌రజాక్ అను నాతఁడు ఆ రేవుపట్టణమును మఱియు వర్తకస్థలిని మిక్కిలి ప్రశంసించెను.

క్రీ. శ. 1605 సంవత్సరమున వసుమాంతుఁడను సాంక్రిపత్త్రికుఁడు రాజాజ్ఞనడసి బొగ్దాదుదాటి పైగ్రసుందసగ్గమించి, మార్మొరా సముద్రవేలఁజేరి, దాని దరులఁజేరించి, యిస్తాంబోల్ (కాన్స్టాంటినోపుల్) మార్గమున వెనిస్ మహాపట్టణము జేరెను. అచట కొన్నివత్సరములు క్రయవిక్రయాదులుసల్పి (మార్సెయిల్స్) లో మూఁడు పరాసుదేశీయుల యోడలఁ గుదుర్చుకొని, గృహోన్ముఖుడై భారతీయులకుఁ బరిచితిలేని పారశీక, ఈజిప్టు, రోమక, పరాసు దేశపుసరకును గైకొని స్వనగరమును జేరెను. దీనిచే నాకాలపు నౌకాజీవనమే కాక వాణిజ్యవైభవము తేటతెల్లమగును. గోలకొండ రాజుల కాలమున 'మచిలీపట్టణము' మఱియు దీనికుత్తరముననున్న నరసాపురము చాల ప్రఖ్యాతిఁగాంచినవి. అచ్చటిప్రజల నౌకానిర్మాణకౌశల్యమును, సముద్ర వాణిజ్యపద్ధతినిగూర్చి, డాక్టర్ ప్రియర్, మోరిస్ మొదలగు పాశ్చాత్యులు మిగుల శ్లాఘించిరి. కాకినాడ, కోరంగి, నీలపల్లి మొదలగు నౌకాశ్రయములు, పదునాఱు పదునేడవ శతాబ్దములందు ఐరోపావర్తకుల హస్తగతమయి కొంతవర్తక వ్యాపారవైభవమును దిలకించియుండెను. ఇప్పుడవికూడ రేవుపట్టణములుగ నిరుపయోగములగుటచే వాణిజ్యలక్ష్మియచటనుండి యంతర్ధానమయ్యెను. ఎన్నియో నౌకాశ్రయములు సముద్రపుటుప్పెనవాతఁబడి మునిఁగిపోయెను. మఱి కొన్ని భూమిలోఁ గలిసిపోయెను.

ఇట్లీ మునుపు జరిగెనెనిమిది శతాబ్దముల కాలమునఁ గాంచిన యాంధ్రుల సాహసికజ్యోతి చల్లారినది. ఐనను నాఁడును మన పూర్వుల సాహసదీపులతోఁ దగిన భావిని వెలిఁగించవలయును. ప్రాచీనాంధ్రుల యూనత్యమును, స్వర్గనాకఁ దెచ్చుచున్న యీ చరిత్ర మింతగొప్పది. ఆ వాణిజ్యపుటైశ్వర్యము, ఆ కాలపు టాంధ్రుల యధసినేశస్థాపనాచరిత్రము కన్నులారఁగాంచిన కాలము చిరస్మరణీయము. ఆ వైభవమును దిలకించి, యా ఐశ్వర్యము ననుభవించిన యాంధ్రులది యదృష్టము. నేటి యాంధ్రులు ఆ వైభవైశ్వర్యములను పునస్సృష్టించి యాంధ్రుల యితిహాసమునకు నింతకు జగజ్జేగీయమాన కీర్తి ప్రసాదింతురుగాక.



# నేనూ కవినే

''భావకవి''

౧

నా చేతిను కలమున్నది
నాకూ తెలుగొస్తుంది
నాకూ భావాలున్నాయి
మరి కవిత్వం వ్రాసేందుకు
నా కింకేమాటంకం?

ఇన్నాళ్ళేమను కున్నారో
నేనూ కవినే తెలిసిందా!

౨

నా పద్యాలకు ఛందస్సొద్దూ
యతి ప్రాసల చిక్కొద్దూ
ఎగవిడిచిన భూతం మాదిరి
మొగ డొదిలిన పెండ్లాం మాదిరి
నిరాటంకం నా కవితా ధార!

ఇన్నాళ్ళేమను కున్నారో
నేనూ కవినే తెలిసిందా!

౩

నా భాష శుద్ధ వ్యావహారికం
వ్యాకరణానికి దూరపు చుట్టరికం
తప్పులుపోయే ప్రమాదం లేదు!
పండిత విమర్శల భయమూలేదు!!
నిమిషానికి పది పేజీల్ వ్రాస్తా!!!

ఇన్నాళ్ళే మను కున్నారో
నేనూ కవినే తెలిసిందా!

౪

నా కవితలో రసం లేదంటావా?
నీ రసం నాకవితలో ఉండదు –
ఏమో భావం తెలియదంటావా?
ఇంత తెలియక రసజ్ఞుడవెట్లా?
ఇదే భావకవిత్వం తెలుసా?

ఇన్నాళ్ళేమను కున్నారో
నేనూ కవినే తెలిసిందా?

౫

ఈ కవితే ద్రాక్షాపాకం
ఒక్క తెలియటం లోనేకాదూ
వ్రాసి వేయటంలో కూడానూ
ఈ కవితే ద్రాక్షాపాకం
ఢంకా కొట్టీ బల్లగుద్దీ
ఉరొమ్ము విఱిచీ తొడచఱిచీ
మీసము దువ్వీ సవాలు చేస్తా!
ఇన్నాళ్ళేమను కున్నారో
నేనూ కవినే తెలిసిందా!

---

"చిన్న బొట్టున్నవాని వీక్షింప రెవరు
పెద్ద బొట్టున్నవాని భావింతురు జనులు
పిలువఁగనె పల్కువానినిఁ బెద్దసేయ
రెంతకైనఁ బల్కనివాని నెంతురు జనులు
తనువు గప్పిన వానికి ఘనతలేదు
గోచి పాతయు దిసమొల గొప్పయండ్రు
నెత్తి వెండ్రుకలున్న నోరెత్త రెవరు
నేల వెండ్రుకలున్న గణింతురు జనులు
ఇంటఁ గూర్చున్నవాని యోచింప రెవ్వ
రడవి మిడికెడువాని నాహాయటండ్రు
కాళ్ళు తల క్రిందనుండుట ఘనత కాదు
కాళ్ళు తల పైననుండుట గౌరవంబు
చాపపైఁ బ్రక్క ఘనతకు సంజ్ఞ కాదు
శంకు పర్యంకమతి గౌరవాంకమగును
నిండు కడుపును జనులు గణింప కుండ్రు
మండు కడుపును భావింతురు మహితమనుచు"

"పికవను కంఠమునఁ దరవాతికోఁతి
ఛీను గళమున విజయ మందార మాల
శేముషీ సుంతు పెట్టుకోఁ దెవలపుట్ట
వాలు తలవాని మొలపు బత్రొక్కట్టు"

# పీడకల

రచన: బి. రామరాజు,
ఎం, ఏ. ప్రథమ

ఆరోజు ప్రొద్దస్తమానం సృష్టికార్య కలాపం నొసటివ్రాతలు పూర్తి చేసి బరువెక్కిన గుండెతో నైరాశ్యాన్ని సూచించే ముఖంతో బ్రహ్మదేవుడు అంతఃపురం ప్రవేశించాడు. నాథుని చిన్నబోయిన ముఖంచూసి సరస్వతీదేవి గుండె నీరైంది. కుశలప్రశ్నం చేసి "ప్రభూ నిఖిల భువన సృష్టికర్తల ముఖకమలం ఏదో చింతా భారాన్ని సూచిస్తుంది. పాదదాసివల్ల ఏమైన అపచారం జరిగిందా?"

ప్రియే! అలాంటిదేమి జరుగలేదు కాని నా వ్రాతల్లో ఏదో తెలియకుండానే పొరపాటు జరిగిపోతోంది. ఎంతో శ్రద్ధతో జీవుల్ని సృష్టించి సత్యం క్షమ ధర్మం మొదలైన సద్గుణాలు సమభాగాలుగా పంచిపెట్టినా మానవలోకంలో అసంతృప్తి దాహాలు రక్తపాతాలు ద్రోహం కుత్సితం రోజురోజు ప్రబలిపోతున్నాయి. ఆదర్శప్రాయంగా సృష్టించిన స్వాధ్యాయము లతోను పవిత్ర హోమానల ప్రదీప్తమైన వేదభూమిలో కూడ మితిమీరిన ...ం కుట్రలు విప్లవాలు బయలుదేరుతున్నై. అన్నదమ్ముల్లోనే అంతఃకలహాలు. ఈదారుణ విప్లవేశపానానికి అంతు ...ట్టుండటూ కాళ్ళు చేతులు కడుక్కొని ...ంచు మెతుకులు నోట్లో వేసుకొని తల బరువుగా ఉండటూ శయనగృహం చేరుకున్నాడు. కాసేపు పక్కమీద అటూ ఇటూ దొర్లాడు. అదేచింతలో కండ్లు మూసుకున్నాడు. కాస్త కూర్కుపట్టిందో లేదో తానొక్కడే సత్యలోకం వీధుల్లో పిచ్చివాడిలా తిరుగుతున్నాడు. వీధుల్లో ఏదో కలకలం ఆరంభమైంది. గుంపులు గుంపులుగా వీధుల్లో గాలవ శాండిల్య పిప్పల గార్గ్య వసిష్ఠ భరద్వాజ మార్కండేయాది మునిగణమంతా జయజయ నినాదాల్తో డెమాన్స్ట్రేషన్ జరుపుతున్నారు. అరె ఇదేం విపరీతం వీరేనా కామ క్రోధాల్ని విడిచి యుగయుగాలు పంచాగ్ని మధ్యమున మహోగ్రతపం చేసి నామ సుప్రసిద్ధులైన మునిముఖ్యులు! అబ్బో! వీళ్ళ గడ్డాలు విభూతి పుండ్రాలు మాయమైనవే! కాషాయ వస్త్రాలు కంథా కమండలాలు యోగదండాలు పారేసి పాంట్సు వేసుకున్నారేం! వీటిపై ప్లకార్డులతో ఏమనా వ్రాశారే ఏదీ! కష్టపడి బ్రతకాలి! నిరంకుశాధికారం నశించాలి! బాధ్యతాయుత ప్రభుత్వం కావాలి! ప్రజాస్వామ్యం కావాలి! ఇందుర్ని గద్దె దించాల్సిందే! బ్రహ్మను పదవీచ్యుతిచేయాల్సిందే! అమ్మో కొంప మునిగిందే!!!

ఇదేం రోగం వీళ్ళకి? ఉండుండి ఇల్లా తయారైనారేం? మోకాళ్ళవరకు లాల్చీలు ఖద్దరుటోపీలు కళ్ళకద్దాలు కాళ్ళకి చెప్పులు అమ్మో అయ్యో సత్యలోకమంతా భ్రష్టమైందే? ముక్కుపట్టుకొని తపస్సు చేసుకొనే మునిముండాకొడుకులకీ విపరీతబుద్ధులేంటి? వీరినోట్లో ఏమో తెల్లగా ఉన్నాయేం? అరరే సిగరెట్లు కాలుస్తున్నారే? వీళ్ళ నిత్యాగ్నిహోత్ర కర్మలు కాలిపోను! మేకలమోస్తరేమో చప్పరిస్తున్నారే? ఊంహూం! తమ్మలపాకులు!!! ప వ న

పర్ణాంబు భక్షులై ఇనుపకచ్చడా లెట్టిన మునిముఖ్యులు!!! ఏదో ప్రళయ మొచ్చేట్టుంది. ఏమో నా అంతఃపురంవైపు పరుగెడుతున్నా రే? తగలబెట్టరుకదా? ఇక్కడుంటే చంపేస్తారట్టుంది..........

అదిగో! వీడెవడు? మా అబ్బాయున్నట్టుందే! బ్రహ్మమానసపుత్రుడు అస్ఖలిత బ్రహ్మచారి ఓరి వీడిదుంపతెగా. శిగ గొరిగించి క్రాపింగెట్టుకున్నాడే! నెత్తి మీద ఇదేంటి? అమ్మయ్యో హ్యాట్టు! సరస సంగీత ప్రియుడు విష్ణుపాదారవిందసంసేవనాపరుడు భక్తిరస పరిప్లుత సుస్నిగ్ధామృత చ్ఛాయా విలసిత ముఖారవిందుడు వీడికీ బుష్కోటెందుకు? ఆఁ! కాళ్ళకు క్రేప్ షూ! స్వర్లోకాలు పులకించేట్టు నిక్వాణించేసే మహతి (నారదుని వీణకు పేరులెండి) ఎక్కడో పారేసి ద్వారం వారివలె వయోలిన్ పట్టుకున్నాడేం! చేతిలో ఏదో గ్రంథముందే స్వరార్ణవం కాదుగదా? అమ్మయ్యో! రేరాణి అభిసారిక సంచికలు వీడి కెక్కడ లభించాయి. ఏలాంటివా ళ్లెట్లా మారిపోయార్రేఁ!............

మరి వీళ్ళెవరు? నిలింప భామినులున్నట్టుందే? త్రిలోక సౌందర్యమూర్తులు వీళ్ళకేం పుట్టింది? ఆఁ ఆఁ! ఆడవాళ్ళకి సమాన హక్కులా? శాసనసభలో సీట్లా? సివిల్ సర్వీసుల్లో రిజర్వేషనా? ఇన్నాళ్లూ మాత్రం మీకేం లోటుండేది! వినాశకాలే విపరీత బుద్ధి అన్నారు. సుదీర్ఘ నీలకుంతలాలు కత్తిరించి క్రాప్సులు తీశారే? హరిచందన కస్తూరికా మకరికాపత్రాలు విడిచి క్యూటీకూర పౌడరు వేశారూ? మరి అధరాలేమో పూర్వంకంటె స్నిగ్ధ సుందరారుణ రాగరంజితాలుగా ఉన్నాయే! అబ్బే పొరపాటు! లిప్ స్టిక్ పేంటింగులు. అమ్మయ్యో చిన్న చిన్న రిస్టువాచీలు పెట్టారు? మరకత మణిమయ భర్మకటకాలు బాగా లేవేఁ? విలాస లాలస కురంగ లోచనాలమీద గాజు పెంకులు తగిలించారూ? సంతానపల్లవ తులితకోమలారుణ పాదపద్మాలకి చీనా బూట్లు తొడిగి వీధు లెంట తిరుగుతున్నా రేఁ! ఎక్కడో ఇంట్లో హాయిగ కూర్చోక మీకీ పోగాల మెందుకు దాపురించింది?......

అరే! ఇదేంటి? నా కొలువుకూటానికి ఏదో బోర్డు తగిలించారే? న్యాయస్థానమా! కోర్టులూ ప్లీడర్లూ ఇక్కడా తయారైనారూ? లోపల ఏం గూడుపుఠాణి జరుగుతోందో కాస్త చూద్దాం. ఈయనెవరు వైకుంఠపతి! చక్రాయుధుడు! ఆర్తత్రాణ పరాయణుడు! భక్తార్ద్రనుడు! అయ్యో దశదిశల దివ్యరోచులు వెదజల్లే నీ పీతాంబర మేమైందీ స్వామీ? నఖశిఖ పర్యంతం నల్లజుబ్బా తొడిగావు? ఓహో న్యాయాధీశపద మలంకరించావు బాబూ! ఏమొండి కాగోడుగు పట్టావు కదూ? ఈ అప్పర్ణు నిజం నీకూ అబ్బింది! కౌస్తుభ మణి మాయమైపోయి మెడకు తెల్ల పేలికల వ్రేలాడుతున్నాయేం? పద్మాక్షుడవు కదూ? బ్లాక్ గాగుల్సు తగిలించావూ! అమ్మయ్యో! చర్చిల్ మార్కు సిగారు నీ కెక్కడ లభించింది ప్రభూ! శంఖుచక్రాలు విడిచి ఇనుపకోయ్యలు పట్టుకున్నావేం! హార కేయూర కటకకుండలాల మోజు తీరిపోయిందా? సరేగాని ఏంతీర్పు చేస్తున్నావు? ఈమెవరు? పరమపతివ్రత శ్రీరామచంద్ర పాదరేణు పునీత అహాల్య ఉన్నట్టుందే! ఓహో ఈయన తపోధనాధ్యుడు గౌతముడు కాబోలు! మరీ ప్లీడరెవరు? స్వర్గాధిపతి మహేంద్రుడు! అరే అహాల్య గౌతముడికి విడాకు లిస్తున్నట్టుందే! అహా!

# సూరనార్యుని సుగాత్రి



శ్రీ. గోపాలకృష్ణారావుగారు, ఎం. ఏ. (ఆంధ్రోపన్యాసకులు.)

ప్రతిభావంతులైన మహాకవులరచనలో జీవత్కళ ప్రకాశమై యుండును. కాన నితరలక్షణములతోఁ బాటు జీవత్కళకూడ కావ్యలక్షణము. ఈ లక్షణముప్రపంచములోని వివిధభాషా సాహిత్యములకు సామాన్యమైనది. సజీవరచన యెల్ల కాలములందు సహృదయుల హృదయముల రంజింపఁజేయుచునే యుండును. వాల్మీకి, కాళిదాసు, షేక్స్పియరు మున్నగు మహాకవుల రచనలు ప్రతియుగమునందు సహృదయుల కానందము కల్పించుచుండుట మన మనుభవించుచునే యున్నాము.

ఆంధ్రసాహిత్యమునందుఁ గూడ మహాకవుల ప్రతిభను జీర్ణించుకొనిన కావ్యములున్నవి. అవి నేటికిని మన హృదయముల నుఱ్ఱూఁతలూపుచున్నవి. తిక్కనామాత్యుని ద్రౌపది, ఆంధ్రకవితా పితామహుని వరూధిని' ముక్కుతిమ్మనార్యుని సత్యభామ నేఁటికిని మనోరంగములపై నాట్యములు సల్పుచుఁ, దమలో జీర్ణించుకొనిన కవీశ్వరుని భావశక్తినిఁ బ్రదర్శించుచున్నారు. పింగళి సూరనార్యుని కలభాషిణి, సుగాత్రి కూడ వరూధినివంటి కావ్యనాయికలవలె నేడును మన భావాంబర వీధులలో స్వేచ్ఛావిహారములు సల్పుచుఁ, దమ కళానైపుణ్యముచే మనల ముగ్ధుల నొనరించుచునే యున్నారు.

సూరనార్యుని సృష్టిలో నీ యిద్దఱు వ్యక్తులు ప్రత్యేక మైన విశిష్టతగలవారు. కలభాషిణి నటముఖ్యుని ప్రియనందన కావున 'సహజవిలసత్కల భాషలచేఁ గళకళ లాడుచు, విటాళి హృదయమును గలతపెట్టు సౌందర్యమూర్తి'. మఱి సుగాత్రియో స్త్రీ లోకమున కాదర్శప్రాయమైన యుత్తమ ఇల్లాలు.

సుగాత్రి సామాన్యస్త్రీకాదు. శారదాదేవి వరప్రసాదమునఁ గాశ్మీరదేశపు బ్రాహ్మణ పూజారికిఁ, గూతురై జన్మించినది. కావున, నుదాత్తభావములకు, నుత్తమాదర్శములకు దర్పణమైయుండుట సహజము. కలభాషిణికిఁగల మన్మథోద్దీపనకరములైన హావభావ విలాసములు సుగాత్రికిలేవు. ఆమెభావము లెంత మధురములో సౌందర్యము కూడ అంత పునీతమైనది. ఈ ఆదర్శమును దృష్టియందుంచుకొని సూరనార్యుఁడు కళాపూర్ణోదయములో సుగాత్రీశాలీనుల కథను, భక్తిరస ప్రధానముగా ననుకూల దాంపత్య శృంగార రసభరితముగా సృష్టించినాఁడు. సూరన సుగాత్రి పాత్రపోషణలో ప్రబంధ సాంప్రదాయములకే మాత్రము లొంగక స్వతంత్రమార్గము ననుసరించినాఁడు. ఈ స్వతంత్రమే సుగాత్రి పాత్రపోషణ కొక విశిష్టత నాపాదించినది.

సరస్వతీదేవి వరప్రసాదమున జన్మించిన సుగాత్రి యుక్తవయస్కురాలైన పిమ్మట శాలీనునకు ధర్మపత్నియైనది. శాలీనుఁ డిల్లటపుటల్లుఁడు. సర్వాలంకార భూషితమె

పడకటింటికి వచ్చిన సుగాత్రిని బ్రిథమ రాత్రి నిరాదరణ దృష్టితోఁ జూచినాఁడు. భర్తయొక్క హృదయమర్మ మెఱుఁగని సుగాత్రి రెండుమూఁడు రోజు లదేవిధముగా రాకపోక లొనర్చినది. చెలికత్తె లీ సంగతిని గనిపెట్టి యెన్నియో విధముల సుగాత్రికి నచ్చజెప్పినారు. చెలికత్తెల మాటలు సందర్భోచితములై, సహజములై యౌచితీ యుక్తములై యున్నవి. వీని నన్నిఁటిని సుగాత్రి వినినది.

"అని విని 'ఈ వెడమాటల
నను నేటికిఁ జంపెదరు! వినన్ [illegible] వప్ర నా'
కని సిగ్గునఁ బలుకదు మా నాఁ
డొనరిచి చూచెను దదీయ యుక్తుల తెఱఁగున్'"

ఇవి సుగాత్రి యౌచితీ యుక్తములైన భాషణములు. చెలికత్తియ మాటలు విననే వినఁపవటు! అట్లు పలికికూడ "నాఁడొనరిచి చూచెను దదీయయుక్తుల తెఱఁగున్" ఈ పద్యమువలన సుగాత్రి జేల కాదని తెలియుచున్నది. సముచిత లజ్జ భర విపశనై తరువాత చెలికత్తియల యుక్తి నంగీకరించినది. కాని భర్తయొక్క అనురాగముమాత్రి మింకను లభించలేదు. ఉదాసీనత్వమే మాత్రిము మనస్సునకు రానీక తన మనస్సు నొక్కసారి పరీక్ష చేసికొనినది. ఈ యాత్మపరీక్షకు న్గి "నా మంగళసూత్రిం బీపాటి సుభద్రితి నుంచుటయ పదివే"లని యెంచుకొనినది. అంతియే కాదు తన తల్లి యొసగిని 'ఇట్టట్టుగాఁ డెకుంప' పాధ్గించినది. భర్తతోఁ బాటు తల్లినిగూడ గౌరవించిన పవిత్రశీల సుగాత్రి. తల్లి మాత్రియు ఎన్నాళ్ళని యోపిక పట్టును? తనకు మనుమఁడో మనుమరాలో కలుగు భాగ్య మెప్పుడబ్బునో యని యువ్విళ్లూరి హతాశ యైనది. ఇఁక నూరకుండుట మేలు గాదని భావించి కూతును మందలించి శాలీనుని దోటపనులకు నియోగించినది. సుగాత్రి యెవరి దిక్కని చూచును. తల్లి నేమియు ననలేక యోచనచేసి భర్తకు సహాయము చేయుట కుద్యానవనము చేరి మధ్యేమార్గము నవలంబించినది. అటు శాలీనుఁ డత్తగారి యాజ్ఞను శారదాదేవి పూజ కుపకరించు కార్యమని తలంచినాఁడు. భార్యాభర్తలకు సరిగాఁ గలసి వచ్చినది. సుగాత్రి దాంపత్య ధర్మము పవిత్రమైనది.

శాలీనుఁ డుద్యానవనములోఁ బని చేయుచుండ ఘనమైన స్వప్నము వచ్చినది. పవిత్ర హృదయముగల సుగాత్రికి సంఘటన కొంత యాయాసము కలిగించినను తనకు జన్మమిచ్చిన శారదాదేవినే భజించినది. దేవి నాశ్రయించుట పిచ్చిగాడని భారతీయుల ధర్మము.

శా॥ "ఈ దేహంబునఁ బూర్వదేహముల యం
దే [illegible] వ్రతధ్యాన దా
నాది ప్రోక్త వమేమి యేమి గలదా
యా పుణ్యమీ వర్షపీ
[illegible] బున మత్పతిం బొందయుకుండ
న్నాను పుంగాత నే
[illegible] మంగాపుతఁ దన్నమిత్త పతి పా
పాకాంతం బాత్రిమఁక.'

నిజముగాఁ ద్యాగశీలమైన యెంతటి కష్టములైనను ఓర్చు శక్తి సంపాదింప వచ్చునను సత్యమును ప్రదర్శించిన సుశీల యీ సుగాత్రి.

తన శక్తిచేత దేవిని మెప్పించి భర్తను రక్షించినది. ఇదివఱకుఁ దల్లిపైనఁ గొంత పేరుచూపు సుగాత్రి యిప్పుడు జారిపోయినది. "తల్లిమాటయు నొక్కింతయుఁ దాఁగైకొనక" భర్తను సేవించుటకుఁ బోయి యొల్లపను లొనర్చినది. ఉద్యాన వనములోని ప్రకృతి దృశ్యములో నిరస్త

భూషిత గాత్రియై స్వేదబిందువులే ముత్యాల హారముగాఁగల సుగాత్రి యపూర్వ సౌందర్యవతిగా శాలీనునికిఁ దోఁచినది. ఆతని హృదయములో నున్న యనురాగరాగ మొక్కసారిగ సుగాత్రి నైజశోభను దర్శించి పైకి నుబికివచ్చినది. ఈ మన్మథానురాగము కారణ జన్మమై మిగుల శోభిల్లినది. పచ్చి శృంగారమున కన్నను బవిత్రమైనది. సుగాత్రి ముఖకమలము కూడ వికసించినది. కొంతసే పతని బాహువులలో మెలఁగి లజ్జచేత "ఇవి మిగులఁ గ్రొత్త లింటికి నేగవలదె? యని ప్రియముచెప్పి విడిపించుకొనియె నతియు" దాంపత్యానురాగమును, సల్లాపక్రియను ఎంతో పవిత్రముగాఁ జిత్రించిన సూరనార్యుని భావనాశక్తి భావనాతీతము.

సరి! జీవితములోని యొక ఘట్టము సమాప్తియైనది సుగాత్రికి. మరల మహారాజ్యభోగమును అనుభవించినది. పతి యనుగ్రహము పొందినందులకు సుగాత్రి భాసిల్లినది. ఆనాఁటిరాత్రి యెప్పటివలె నలంకరణములు ధరించి భర్తయొద్దకుఁ బోయినది. కాని—

ఉ। "అప్పటి తద్విలేపన పటాభరణాదుల
వైభవోన్నతుల్
ఱెప్పలు విచ్చి చూడక చరింపనియట్టి
పరాకుచేతఁ దా
నెప్పటియట్ల యుండె నతఁ, డింతి కడుం
దడవుండియుండి 'నా
యొప్పమి యేమిసంఘటిలె నొక్కొ!'
యటంచు విషాదమొందఁగన్."

సుగాత్రి విషాదపడినది. అంతియేకాదు. ఆమెపైఁ బిసుగుపడిన ట్లైనది శాలీనుని మాటకు. "ఎందుకు వచ్చినావు?" అనిన మాటయే సుగాత్రికి సూదివలె నాటినది. ఆనాఁడే పతి యనురాగము వడసి, యదే రోజు ఏమియుఁ దప్పు చేయనప్పుడు భర్త మాటలు వినుటకు నాతని ప్రవర్తనకు భయము, నాశ్చర్యము, విషాదము నొక్కసారి కలిగినవి సుగాత్రికి. ఇపుడు తా నూరకొనలేదు.

"లోకము వారలు పతిక
క్కే కోర్కిని వత్తురనుచు నెంతయు సొలసెన్"

తాననిన మాటలకుఁ దానే సొలసి పోయినది. తర్వాత

"హాయైనఁ గొంతమేల్ నా
రాయణ! మీమనసు నింకె, హీనిఁక నెపుడున్
మీయంత దడవెక్కర" యని
యాయంగన యతనిపాద మల్లనఁ బట్టెన్.

ఇచ్చటను మరి తరువాతి పద్యముల లోను భర్తతో వాదించిన సుగాత్రి పతిభక్తి కేవలము మూఢత్వముతోఁ గూడినదని చెప్పుటకు వీలులేదు. భర్త, సౌఖ్యము వడయుట కాతని మనోరథమేమియో కనుగొనఁ గోరినది. తుదకు అతనికొక వేళ నితర స్త్రీపై ననురాగమున్నచో ఆ స్త్రీని దానే తీసికొని వచ్చెదనని చెప్పినది. ఎంతయైనను భర్తయొక్క మనస్సును గట్టిగా గుర్తింపఁగుటకుఁ జేసిన ప్రయత్నమిది. శాలీనుని ప్రకృతి యెట్టిదోకాని నోటినుండి ఒక్కమాట వెళ్ళిన నొట్టు. తన యభిప్రాయ మొక్కమాటలోఁ జెప్పినను ఇంత మనోవిషాదము సుగాత్రికిఁ గలుగక పోయెడిది. శాలీనుని యీ విచిత్ర ప్రకృతి సుగాత్రి పాత్రపోషణలోఁ గొంతభాగము పంచుకొనినది.

ఎట్టులో ఆరాత్రి గడచి తెల్లవారినది. సుగాత్రి తిరిగి తోటలోనికివెళ్ళి యలంకారములు మూలకుఁబెట్టి భర్తకు సహాయము చేసినది. నిండు కడవవలె నున్న సుగాత్రి సౌందర్యమును శాలీనుఁడు మనసార

ననుభవించినాఁడు. సుగాత్రికి భర్తయొక్క ప్రకృతి తెలిసిపోయినది.

ఇఁకఁ దల్లికీ రహస్యము తెలిసినది. మెల్లగాఁ గూతును మందలించినది.

"ఓ తల్లీ! కొడవయొక్కటి
నాతలఁపునఁ దోఁచినది, వినవే వలయు, గుణా
న్వితుండుగాని సుతుఁడు ప్ర
సూతుం డగునఁట! యకాల సురతక్రియలన్."

తల్లి కూతుతో నీ విధముగా నెంగు కనవలసి వచ్చినదో? సూరనార్యుని యభిప్రాయ మేమో తెలియరాకున్నది. ఒక వేళఁ దాను కూతురితో నకాల సురతక్రియల వలన గుణాన్వితుండు గాని సుతుఁడు ప్రసూతుం డగుననియు నది మాన వలయు ననియుఁ జెప్పుటయే యభిప్రాయము కల్దై యున్నచోఁ దరువాతి పద్య మా యభిప్రాయమును వ్యంగ్యరూపములోఁ దెలుపు చున్నది. ఎట్లన:

"నాఁటికి ౘట్టి దైవ ఘటనంబునఁగో నిను
నొల్లకెంతయుం
గాటపుఁ గోపమున్ మనుపఁగాఁ దను
నెమ్మెయినాఁటిఁ గాక పూఁ
దోటకు జీతగాండ్రు మన తొల్లిటి వారలు
లేరె? నీవిభుం
డేరికిఁ బోవఁగా వలయు, నీవటుపోవఁగ
నేల కూతురా!"

"భవత్కాంక్షి వయసునఁ బి
న్నవుగాని వివేక గుణమునన్ మిక్కిలి పె
ద్దవు నీవు తెలియుని య
ట్టి విధినిషేధమ్ము లెక్కడవి తలపోయన్."

పైని యీ రెండు పద్యములు సుగాత్రిని "అకాల సురతక్రియలచే" మాన్పుటకుఁ జాలు. అనౌచిత్యము ఏమాత్రము లేదు. కాని పూర్వోదాహృతమైన పద్యము (ఓ తల్లి......యనునది) కొంత యనౌచిత్యము నాపాదించు చున్నదని యనుమానము కలుగుచున్నది. ఈమాటలే చెలికత్తెలనినచో నే దోషముండక పోయెడిది.

వారిదవఱకే సుగాత్రిని "నీ బంగారు వంటి ప్రాయము సంగతియే గిత్త శయ్యకు నోసఁగకే." అని సూటిగా మందలించి నారు. ఏది యెట్లున్నను ఆమాటలకు సుగాత్రి "మొలకనగవు మొగంబున నిగురొత్తఁ దల్లిఁజూచి" యిట్లన్నది.

"పసనకు నెగ్గియింపది సువర్ణనఁ గాఁగఁ,
దదప్రియం బస
చ్చరితము గాఁగ నెన్నుదు, నిసర్గము నాఁది
మానరాదు, యీ
శ్వాఁడును వేదమంగనుఁడు సర్వము
భర్తయు, యందదాజ్ఞను
ద్ధమరిఁ జేయుమన్ విదినిషేధము లెవ్వియుఁ
గలోనన్ మదిన్."

"వినుమయ్యవయు నిద్దా
జని విడుచుట లేదు, విహితమని చేయుటలే
దనుమానింపక నెద్దది
నెనిమిట నున్ననిదవిడుసుఁ ప్రియమొన
రింతున్".

భారతీయా దర్శమును దనలో జీర్ణించుకొనిన సుగాత్రి యాదర్శగృహిణియైనది. పతికిలొంగి యాతని యడుగులొత్తిన పతితస్త్రీ మాత్రము గాదు. ఎంతటి కఠిన సమస్యయైనను, దాత్కాలికావేశమునకు వశము కాకపోయినచో సహన శక్తివలన విడఁదీయవచ్చును. సహించినంత మాత్రమున నబల యని స్త్రీని వర్ణించుట, లేదా, తలఁచుట పొరపాటు - స్త్రీ యబల కాదు యుక్తాయుక్త వివేచనా శక్తికలిగి, భర్తృవాంఛితమును నెరవేర్చుటయే పతివ్రతా ధర్మమని సుగాత్రి లోకమునకుఁ జాటినది సూరనార్యుని సృష్టిలోని యాదర్శవ్యక్తి సుగాత్రియైనది. పతి భక్తిమహిమను వానిఁ గూడఁ బ్రత్యక్షమై యాశీర్వదించినది. ఇంకేమి? అన్నియునవి కూడినవి. సూరనార్యుని సృష్టిలోని కల భామినిని మించి పోయినది. పతివ్రతయనినచో నిజముగా

సుగాత్రియే పతివ్రత. సూరనార్యుఁ డిట్టి యాదర్శ పతివ్రతను సృష్టించి ధన్యుఁ డైనాఁడు. నన్నయభట్టు వలె నౌచితీ ప్రధానమైన దాంపత్య శృంగారమును బోషించినాఁడు. ఇత రాంధ్ర కవులను మించి పోయినాఁడు. ఆంధ్రసాహితి యాతని ప్రతిభవలన సంతుష్టినొందినది.

* *

పానుగంటి లక్ష్మీనరసింహారావు:-

"మన కర్మముతో నీశ్వరున కేసంబంధము లేదు. 'ఏమియు సంబంధము లేదా'? యని యడుగుచున్నారా? లేనట్లున్నది. ఉండుటకంటె లేకుండుటయే మేలుఁగనున్నట్లున్నది. మనకర్మముల ననుసరించి మన కీశ్వరుఁడు తత్కర్మఫలములను బంచిపెట్టును. ఇంతకంటె నాతని ప్రయోజకత్వ మేమియులేదు. ఆతఁడందువలన మోఁతకూలి, కాని దాతకాఁడు. ఆ వెట్టిపనికే జనులాతనిఁ దిట్టుచున్నారు. సుఖానుభవకాలము రవంత పెంచుటకుగాని, కష్టానుభవకాలము కాసంత త్రెంచుటకుఁగాని యీశ్వరునికి శక్తిలేదు. మనమే యొక ప్రపంచము మనకు మనమే యీశ్వరులము!"

"ఇఁకఁగవి బ్రదు కెట్లున్నదో చెప్పనా. కవిత్వమల్లినవాని కొక్క ముసలిదియో, పడుచుదియో, యటునిటు కానిదియో, సువాసినియో, విధంతువో, యటునిటుకానిదియో, యొక్కతె ప్రక్కదాపుగానుండక తప్పదని జనుల నమ్మకము. దేవుఁడున్నాఁడను నమ్మకముకంటె జనులకిది దృఢతరమై యున్నది. దేవీభక్తుఁడగు కాళిదాసునకుఁగూడ నీ నింద తప్పినదికాదు. కవి యనఁగాసోమరి. ప్రపంచజ్ఞాన శూన్యుఁడు. తిక్కతత్త్వము గలవాఁడు. స్వతంత్రమైన వృత్తిచే జీవించువాఁడుకాఁడు. ఒకనినీడను దిరిగిబ్రతుకువాఁడు. అందఱకు దాసుఁడు. కాని యెవఁడు చెప్పినమాటను వినువాఁడు కాఁడు. అందఱిని దిట్టువాఁడు, అందఱిచేతఁ దిట్టుతినువాఁడు. దరిద్రతలో నింత తెగనీల్గు మఱియెచ్చటను లేదు. చేతగానితనములో నింతగర్వము మఱియెచ్చటను లేదు. ప్రత్యక్షమందుఁ జేత రాగికాసులేకున్నను, భావనలోఁ దలక్రింద మేరువు గలవాఁడు ఆ పూటకన్నములేక చావు. ఆ చంద్రార్కముగ శాశ్వతుఁడనను నమ్మకము గలవాఁడు. బ్రహ్మదేవుఁడు తన్ను బాగుజేయ యత్నించినను బాగుపడువాఁడుకాఁడు. కాని ప్రపంచము నంతను బాగుచేయుటకుఁ బ్రయత్నించువాఁడు. కవియిట్టివాఁడు. ఇంతకంటెఁ దిక్కువాఁడు మఱియింతకంటె కొనవెఱ్ఱివాఁడు. అతనివెఱ్ఱికి ప్రజలే కొంత కారణము. ప్రజలాతనిఁ దిట్టి రేఁగఁగొట్టుచున్నారు. రేఁగినప్పుడు మాత్రము వెఱ్ఱికుక్కవలె నాతఁడందఱిఁ గఱచును. కవిని దిట్టఁజాలనంతి మొద్దు ప్రపంచమునలేదు...... పనికిమాలినకవి పస్తుపడుచున్నను బదర్యమ్మక మానఁడు. అల్లినవాఁడు తనలోఁదాను సంతోషించి యూరకుండునా? ఊహూఁ! ప్రత్యాసక్తిగఁ బనికట్టుకొని బండికర్చుపెట్టుకొని బత్తెము మూటగట్టుకొని పోయిపదిమందికి వినిపించినదాక కొట్టుకొనునేకాని యితని దిక్కుమాలినసోదె యెవఁడు వినును?"

# అపశ్రుతి

శ్రీ పల్లా దుర్గయ్యగారు, ఎం. ఏ. (ఆంధ్రోపన్యాసకులు)

ఎన్నఁడు మీటనట్టి శ్రవణేంద్రియ దారణమౌ అపస్వరం
బెన్నఁడు చేయి పోయి చెడనేటికి మీటితి? 'రామచక్కనౌ'
కిన్నర తంత్రులందు ప్రకటింపవొ మీటులు? జీవ సూత్రముల్
తెన్నుఁగఁ గూర్పనైతొ? పెకలించితొ? యే విపరీత తానముల్. ౧

కిన్నరచేతఁ బూవి కలనిక్కలన్ మొలపించి మానసా
వెన్నవలెం గరంతువవి వీనులు కోసుకొనంగ నూఁజలన్
జన్నము తేర్చువారిక నపథ్యమ్ములఁ ద్రొక్కితి! నెచ్చినావు నీ
వెన్నఁడు! పాలుపోవి విషమెంతయుఁ గ్రక్కెడు వింతనాదముల్. ౨

మున్నెకనాఁడు లోకములు మోహము నిష్ఠురముగ్గఁ. పస్తుటన్
తన్నుచు నింద్రియంబులు పలం బజియుండి, యెంతటె
న్నున్నను లేవకున్న; దాహాసము లో కేజమన్పంబు నీ
కిన్నరి నూర యూవ పలికించితి నించితి నాదముల్. ౩

నీ సాంసస్వరమ్మున ధ్వనించె శత్రుల్, విరసించె నంగుళీ
న్యాసములన్ సమస్త భావనంబులు, నీ కరచాలనంబులన్
మోసులు మోసులై స్మృతియముల్ పులకించె, త్యాగీయకంటి వి
న్యాసములన్ రణించె ప్రణయ ప్రథమ ప్రణవ ప్రణాదముల్. ౪

అసలే లోకము శోక మోహామయితే హేయస్థానమౌ మూట మున్
సినవైయున్న డటున్న: నీవును వినిపించు సంచయస్థానములో
నినము బోనలఁ బోవఁజూచితివి! భవన్నీనాద్యాస్థానమునకు వని
శ్వాసంబుల్ మనిసేయకున్న మునుపే పాడైన యీ లోకముల్. ౫

కమ్మని పాటగాడి యనురాగమ్ముల దేహము, జోపు మంతరం
గమ్ముల, నింద్రియమ్ముల సుఖమ్ములనుండి మటిచ్చి స్వర్గలో
కమ్ములు దాటి బ్రహ్మసుధామ్ములఁ గూర్చును గాక; ఊపు లో
కమ్ముల జోలపాడి, నరకమ్ములు గూడ లయమ్ము నొందఁగన్. ౬

ఇంపుగ గోటమీటి పలికింపుము వీణియ, తంత్రులందుఁ గ
ల్పింపుము హాయి, హాయి కలిగింపుము నింపుము రాగముల్ సుతా
రింపుము తారమందు, సవరింపుము కంపము తెళ్కుపెళ్కులో
ల్కింపుము, జంత్రమందు మధియింపుము రాగరస ప్రవాహినుల్. ౭

---

# కమ్యూనిస్టు చీనా

"కల్వాల" బి. ఏ.

కమ్యూనిస్టు చీనా ఏర్పడినపిమ్మట ఆ రాజ్యమును అమెరికా, తదితర రాజ్యములు తప్ప నన్నియు గుర్తించినమాట జగద్విదితమే. చీనా దేశము లోని కొమింటాంగు ప్రభుత్వమును పడఁగొట్టవలయునని ౧౭ సంవత్సరముల నుండియే సన్నాహము సాగుచుండెను. చీనా దేశచరిత్రలో సన్ యట్ సేన్ కు పూర్వ మెప్పుడును నిత్యకల్లోలములే. కాని ఆయన ఆ విప్లవ నాయకులనందఱి గణించి ౧౯౧౧ లో 'రిపబ్లిక్' స్థాపించెను. ఈయన పాలన క్రింద కొద్దిరోజులు చీనాలో శాంతి నెలకొనినది. ఈయనమృతి తిరిగి కల్లోలములకు దారి చూపినది.

౧౯౨౧ లో షాంఘైలో చీనాకమ్యూనిస్టుపార్టీ స్థాపింపబడినది. అప్పటినుండి అది సన్ యట్ సేన్ మృతివఱకును కొమింటాంగుతోనే కలిసి పనిచేయుచుండినది. కాని చాంకై షేక్ రిపబ్లిక్ ప్రధానికాఁగానే కమ్యూనిస్టుపార్టీ, ప్రభుత్వపు పార్టీనుండి వైదొలఁగినది. చాంకై షేక్ వారితో మైత్రి చేయుటకిచ్చగింపలేదు. అట్లుచేయుటయన వారికి లొంగిపోవుటేయని యతఁడు తలంచెను. ౧౯౨౭లో కొమింటాంగు నుండి కమ్యూనిస్టులు పూర్తిగా వైదొలఁగిరి. వారు ప్రభుత్వమునకు విరుద్ధముగాఁ గత్తికట్టిరి. కమ్యూనిస్టులు ప్రభుత్వమును తమ హస్తగతము చేసికొనఁ బ్రయత్నించిరి. షాంఘై సమ్మె సాయుధవిప్లవము భగ్నమైనతదుపరి కమ్యూనిస్టు నాయకత్వములో మార్పులు వచ్చెను. లై లెసాన్ నుండి ప్రస్తుతము చీనా నేతయగు మావ్ సిటుంగ్ నకు నాయకత్వము ప్రాప్తించెను. మావ్ మంచి స్ఫురద్రూపి. చిన్నతనము నుండియే తాను అనుభవింపనున్న ఇక్కట్లను సహించుకొనుట కనువుగా తన శరీర నిర్మాణము గావింపఁదొడఁగెను. చలిలో, ఎండలో వానలో గంటల తరబడి నిలుచుండి సహనశక్తిని వృద్ధిచేసికొనఁ బ్రయత్నములు చేయుచుండెను. చీనా కమ్యూనిస్టు సైన్యము ౧౯౨౮లో నిర్మింపఁబడెను. 'చూటే' నాయకత్వములో ఈ సైన్యము పోరాటము సాగించెను. మావ్ ఆగమనముతో కమ్యూనిస్టుపార్టీ కార్మిక రంగమును వదలి వ్యవసాయ రంగములో విజృంభించి పనిచేయసాగెను.

షాంఘై విప్లవభగ్నత కమ్యూనిస్టుల కచ్చోట నిలువనీడలేకుండఁజేసినది. దానితో కమ్యూనిస్టుసైన్యము కియాంగ్సీయనుదక్షిణ చీనారాష్ట్రములో గుమిగూడి కొమింటాంగు ప్రభుత్వమును గూలఁద్రోసి మూఁడు సంవత్సరాల పాటు పరిపాలన సాగించెను. కాని ౧౯౩౩లో చియాంగ్ కై షేక్ సేనలు పెద్దపెట్టున ముట్టడించి చేతికిదొరికిన ప్రతి కమ్యూనిస్టు సైనికునిఁ జంపెను. చంపఁగా మిగిలిన కొద్దినాయకులను, సానుభూతిపరులను మొత్తము ఏనుబదివేల మందిని వెంబడించుకొని కియాంగ్సీను వీడి ఆరువేల మైళ్ళు ౩౩౬ రోజులు నడిచి యెదురైన కొమింటాంగు సైన్యముల నెదుర్కొనుచు చచ్చుచుఁ జంపుచు మావ్ యనాన్ చేరెను. యనాన్ చేరువరకు మిగిలినవారు

ఇరువది వేలమంది. చియాంగ్ యాంగ్సే నదివద్ద వీరిని ఆపి హతమార్చుటకు గొప్ప సన్నాహము చేసెను. కాని కమ్యూనిస్టులు చియాంగ్ సైనికుల వేషములు దాల్చి పెక్కుమంది కమ్యూనిస్టులనునదిదాటించిరి.

యనాన్‌లో మావో తన ప్రభుత్వమును స్థాపించెను. చియాంగుతో ఏడేండ్లు యుద్ధము చేసెను. కాని ఇరుపక్షముల వారికిని జయాపజయములు సమానముగానే ప్రాప్తించు చుచువచ్చినవి.

౧౯౩౭లో జపానువారు చీనాపై దురాక్రమణ ప్రారంభించిరి. జపానుకు విరుద్ధముగా యుద్ధము సాగించుటకు రష్యా కమ్యూనిస్టులను, అమెరికా కౌమింటాంగు వారిని ఒక్కచోటు జేర్చుటకు ప్రయత్నించినవి. జపాను వారి నెదుర్కొనుటకు తాత్కాలికముగా ఇరుపక్షముల వారును ఏకమైరి. కమ్యూనిస్టుసైన్యములు కౌమింటాంగుతో జేరి పోరాడినవి. కాని మావో తనలక్ష్య సాధనమునకై చేయు ప్రయత్నముల బిగువును మాత్రము సడలింపలేదు. అతడు ప్రతికమ్యూనిస్టు సైనికునకును, తనకృషిలో మూడు పాళ్ళు పార్టీ యభివృద్ధికొఱకును, మిగిలినది జపాను వారికి విరుద్ధముగా యుద్ధములోను వినియోగింపవలసినదిగా నుపదేశించెను. యుద్ధ మీవిధముగా నడుపబడినది.

ద్వితీయ సంగ్రామానంతరము జపాను అమెరికాకు లొంగిపోయిన పిదప కమ్యూనిస్టుపార్టీకి, కౌమింటాంగుకు తిరిగి కక్షలు ప్రారంభమైనవి. ౧౯౪౭ లో చియాంగ్ సైన్యములు మరల యనాన్‌ను ఆక్రమించెను. కాని మంచూరియాలో రష్యా సైన్యములున్నందు వలన చియాంగ్ మంచూరియా నాక్రమింపలేక పోయెను.

షాంఘై విప్లవానంతరము డైరెన్ రష్యాకు పారిపోయియుండెను. తిరిగి రష్యా సైన్యములతో మంచూరియాలో ప్రత్యక్షమయ్యెను యాల్టా ఒడంబడిక ప్రకారము రష్యా సైన్యములు మంచూరియా వదలంగానే ఆ డైరెన్ హస్తగతమయ్యెను. దానితో యనాన్ తిరిగి ౧౯౪౮ లో కమ్యూనిస్టు విజయములు ప్రారంభమైనవి. ౧౯౪౯ జనవరి ౨౨వ తేదీవఱకు పెకింగ్ నగరము ఆక్రమింపబడినది. ఇది మంచూ చక్రవర్తుల రాజధాని. ఏప్రిల్‌లో నాంకింగ్ లభించినది. ఇదిచియాంగ్ రాజధాని. మే నెలలో షాంఘై, ఈ తీరుగా రెండేండ్లలో చీనా దేశము యావత్తు వారియధీనమైనది. చియాంగ్ ప్రభుత్వము నామమాత్రావశిష్టమే. ఫార్మోజా దీవి వారికి ప్రస్తుత రాజ్యము.

పెకింగ్ పతనముతో చియాంగ్ తన రిపబ్లిక్ అధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చినట్లు తెలిపెను. లైచెంగ్ జెన్ తాత్కాలికాధ్యక్షుడుగా పనిచేసెను. కాని చుంకింగ్ పైకి కమ్యూనిస్టుదళములు వచ్చుచున్న వార్త తెలియంగానే పోంకింగ్ చేరెను చియాంగ్ తిరిగి ౫వ డిసెంబరునాడు అధ్యక్షపదవిని స్వీకరించెను.

షాంఘై తరువాత ఏ ప్రదేశమునను ఘోరపోరాటము జరుగలేదు. అమెరికా సహాయమున తర్ఫీదైన సైనికులకు ఆయుధములొసంగి గొరిల్లా యుద్ధము చేయింపవచ్చునని యాశయున్నట్లు తెలియుచున్నది. దీనికి కారణములు గ్రీసులో గొరిల్లాలు పొందిన విజయములును, అమెరికా సహాయముయొక్క యాశయును అని విదితమగుచున్నది.

* * *

# గ్రాంథిక భాష : వ్యావహారిక భాష

ఓం. రఘునాథరాజు బి. ఏ. (ద్వితీయ)

ప్రపంచములో వ్యవహృతము లగుచున్న నాగరక భాష లన్నింటికిని రెండు రూపము లుండును, వాగ్రూపము: లిఖిత రూపము. మానవుఁ డనాగరకుఁడుగా నున్నపుడు తన భావములను సంజ్ఞలమూలముగఁ బ్రకటించుచుండెను. రానురాను నాగరకత ప్రబలిన కొలఁది సంజ్ఞలకు బదులు కొన్ని ప్రత్యేక శబ్దము లుపయోగింపసాగెను. ఈవిధముగఁ గ్రమేణ ఒక భాషకు వాగ్రూప మేర్పడినది. ఈ రూపమునే వ్యావహారికమని యనవచ్చును. నాగరకత యభివృద్ధి గాంచిన కొలఁది దూరమున నుండు తోడివారలకు సంగతులు తెలుపుటకై యొక సాధనము కావలయు నవసర మేర్పడినది. అప్పుడు ఆ భాషకు లిఖిత రూపమేర్పడినది. రానురాను ఈ లిఖిత రూపమే సంస్కారమును జెంది గ్రాంథిక మనఁగా వ్యాకరణాది నియమములచే సంస్కృతమై ఒక నియత రూపమును దాల్చినభాష.

సామాన్యముగా ప్రతి భాషయందును, మాట్లాడు భాషలో ననఁగా సంభాషణము లందు వ్యాకరణాది నియమము లంతగాఁ బాటింపఁ బడవు. ఈ విషయమున వాక్సౌలభ్యమే ప్రధానముగా నెన్నఁ బడును. ఇఁక దానిని లేఖినీబద్ధ మొనర్ప వలయు నన్నచో నవశ్యముగఁ గొన్ని నియమములు పాటించుట కలదు. రేఖాగణిత శాస్త్రాదు లందు సాధారణముగా మొదలొక చిత్తు ప్రతిని గీసి తర్వాతదాని నాధారముగా నిడికొని సక్రమ మైన, సరియైన ప్రతినిఁ దయారు చేయుదురు. అట్లే భాషా విషయమునంగును. వ్యవహారమున నంతగా నియమములను బాటింపక లేఖనమునఁ గొంత జాగ్రత్త వహింపవలసి వచ్చును. రెండింటను ఏ విధమునైన నియమములు పాటింపఁ బడనిచో నా భాష నిరంకుశమై నానా మార్గముల స్వేచ్ఛా విహారము సేయుచు దిగఁ బరిణమించును. దానికి నొక నిజస్వరూపమని యుండదు. రత్నము స్వయముగా మక్కిలి కాంతివంతమైన వస్తువే. అయినను దానిని ఉచితరీతినఁ గోసి, మెఱుఁగు పెట్టినచో మఱింత ప్రజ్వరిల్లును. లేనిచోఁ గొంతకుఁ గొంతమైన దాని మెఱుఁగు మఱుఁగున నుండవలసి నదే. ప్రతివస్తువునకును సంస్కార మవసరము. సంస్కారహీనమైనది తన సహజ రమణీయతను గోల్పోవునుగదా! అట్లే భాషయును. అది వ్యవహారమున నెట్లున్నను లిఖితరూపమున నవశ్యమగు సంస్కారము గాంచినచో వ్యాదృశ్యము గనుపించును.

అన్ని భాషలకు వలెనే మన యాంధ్ర భాషయందును వ్యావహారికమని, గ్రాంథికమని రెండు రూపములు గలవు. కాని కొందఱత్యభ్యుదయవాదులు గ్రాంథికమును బొత్తిగా నెగురఁ గొట్టి వేయవలయునని సమకట్టినారు. అందులో వారు చాలవఱకు కృతకృత్యులైనారు కూడ. అసలీ యుగమే విప్లవయుగము. ఏదైనఁ గ్రొత్త మార్పును — అది మంచిది కానిండు, చెడ్డది కానిండు

—అనాలోచితముగనే చంకలు గొట్టుచు
నాహ్వానించు కాలము. కొంచెము పెద్ద
యనిపించుకొనినవాఁడు, ఒకవిషయమును
గురించి యొక క్రొత్త ప్రతిపాదన మొన
రించినఁ జాలును, వేనవేలు సామాన్య
జనులు దానికి హృదయ పూర్వకముగా
స్వాగత మిత్తురు. అది ప్రబలిన కొలఁదిని
విధి లేకయో, భ్రమవశమునో స్వయము
గాఁ గొంచె మాలోచించు శక్తి కలవారు
సైతము మా ప్రవాహమునఁ బడి కొట్టుకొని
పోదురు. మన యాంధ్ర భాషావిషయ
మునను జరిగిన దింతే. 'గ్రాంథిక భాష
యనేక నియమ సమన్వితమై దుర్గ్రాహ్య
మై యున్నది కాఁబట్టి దానిఁ బొత్తిగాఁ
దీసివేసి యన్నిటను వ్యావహారికమే
ప్రయోగింప వలె'నని యొక మహాశయుఁ
డనఁగానే సామాన్య జనమంతయు దాని
పై విఱుగఁ బడినది. అసలే కాల మంత
గా దేశీయ భాషాదరణము లేనిది కాఁబట్టి
వానిని శ్రద్ధగాఁ జదువు కొను వారి సంఖ్య
చాల తగ్గినది. అందు వలన మాతృభాష
లో సామాన్యముగా మాట్లాడుటే గొప్ప
విషయమన్న నిఁక సాధుభాషా భాషణము
లేఖనము కష్టసాధ్యమై పోయినది. అది
కారణముగా ఈ సూచనను ప్రతిపాదించు
టయు, దాని కనుకున్న దాని కన్న
నెక్కువ యాదరణము లభించుటయు జరిగి
నది ఇప్పు డీ భావము మనలో ననేకులకు
మార్పు వీలులేనంతగాఁ బాతుకొని పోయి
నది. అంతే కాదు—ఈ భావమే నిలువఁ
డొక్కుకొని పోవు ప్రమాద మేర్పడినది.

వ్యావహారిక భాషావాదుల వాదనమే
మనఁగా గ్రాంథికభాష బహు నియమ
యుతమైనదియు, దాని నలవఱచుకొనుట
మిక్కిలి కష్టసాధ్యమైనదియు, జనసామా
న్యమున కందుబాటులో నుండదనియును.
నిజమే! గ్రాంథికభాషలోఁ గొన్ని నియ
మములున్న వన్న విషయమును ఎవరును
గాదనఁజాలరు. కానిగమనింపఁదగిన విషయ
మేమనఁగా ఈచిక్కు ఒక్క తెలుఁగు నందే
యున్నదా? లేక ఇతర భాషలయందును
గలదా? యనునది. ఇతరభాషలయందును
ఈ చిక్కున్నచో నవికూడ గ్రాంథికమును
దీసివేసి వ్యావహారికమునే యనుసరించు
చున్నవా? ఉదాహరణముగా హిందీనిగాని
ఉర్దూనుగాని తీసికొనుఁడు. హిందీ, ఉర్దూల
లో నన్నిటికన్నఁ గఠినమైనది లింగనియ
మము. ఇంచు మించన్ని భాషలలో ప్రాణి
సమూహమునందు స్త్రీ పుం లింగములును.
జడములందు కేవలము నపుంసక లింగమే
యుండును. తెలుఁగునం దింతకన్నను
సౌకర్యము గలదు. కేవలము స్త్రీ పురు
షులకే స్త్రీ పుం లింగములున్నవి. ఇతర
ప్రాణులకు సైతము - అనఁగాఁ బశుపక్ష్యా
దులందు—అవి మగవికానిండు, ఆఁడువి
కానిండు—నపుంసకలింగమే యుపయోగిం
పఁబడుచున్నది. హిందీ ఉర్దూలలో నట్లు
గాక జడపదార్థములందును గుణవాచకము
లందును స్త్రీ పుం లింగభేదములున్నవి.
అవియును ఒక నియమము ననుసరించి
యుండవు. ఇతర భాషలలో నర్థమునకుఁ
బ్రాధాన్యమిచ్చి లింగనిర్ణయము జరుగు
చుండఁగా హిందీ ఉర్దూలలో శబ్దమునకే
ప్రాధాన్యమిచ్చి లింగనిర్ణయము జరుగు
చున్నది. ఈ భేదము ఆభాషల వ్యాకర
ణము చదివినంత మాత్రముననే యల
వడదు. భాషాభ్యాసమే యీ విషయ
మును బోధించునది. ఇన్ని కష్టములైన
నియమములు- వ్యాకరణముగూడ బోధింప
లేని నియమములు- గల ఆ హిందీ ఉర్దూ

లలో వ్యావహారిక భాషావాదము బయలుదేరినదా? అంతమాత్రమున వానికి దేశములో వ్యాప్తి తగ్గినదా? ఇప్పుడా భాషయే మన జాతీయభాషగాఁ బరిగణింపఁ బడినదే! జాతీయభాషగాఁ బరిగణింపఁ బడినతర్వాత నయితము జనసామాన్యమున కందుబాటులో నుండవలయునని యీ నియమములను దుడిచి పారవేయ లేదా? వానిని మనము గౌరవింపుట లేదా? శ్రమించి యభ్యసించుట లేదా? ఆ నియమములను దీసివేయుటంత మాత్రమున మన మా భాషలను, మార్పును స్వీకరింపలేని చచ్చుభాషలని కాని, సంకుచిత స్వభావము గలవి యని కాని యనఁగలమా? మన మే భాషకును శాస్త్రీయములనఁ గలుగని ప్రమాదము మన తెలుఁగునకే యేర్పడినదా? పరభాషలను ఇతర ప్రాంతములవారికన్న నతి స్వల్పవ్యవధిలో నతి నిపుణముగా నేర్చుకొనుటలోఁ బ్రసిద్ధిగాంచిన దాక్షిణాత్యులమైన మనము, మన మాతృభాషనే శుద్ధముగా నభ్యసింపలేమా? ఆశ్చర్యము! సిగ్గు!! ఎవరైన విన్న నవ్విపోదురు.

సరే! ఇఁక వ్యావహారికము వలన మన భాషలోఁ గలిగిన పరిణామమును గొంత ప్రస్తావింతును. మన భాష మిక్కిలి నిద్రావస్థలోఁ మునిఁగి యున్నప్పు డీ వాదము బయలుదేరినది. అప్పుడు తెలుఁగుబాస యే కొలఁది పండితులవశములో నో మితమై యుండెను. మంచిమంచి శాస్త్రజ్ఞులు వారి మాతృభాషయగు నాంధ్రమును నిరుపేక్షకై యుండుటచే మన భాషయందు శాస్త్ర సాహిత్యము శూన్యమై యుండెను. సారస్వతమునకు సంబంధించిన సాహిత్యము కూడ నల్పముగా నుండెను. మన రచయితలకు గ్రంథరచనకు వలయు పరిజ్ఞానమున్నను భాషాజ్ఞాన మంతగా లేనందున నాంధ్ర గ్రంథరచన మిక్కిలి యరుదుగా సాగుచుండెను. సాగినను బద్యకావ్యములే కాని వచనరచన బహుస్వల్పముగా జరుగుచుండెను. ఆ కాలమున వచన రచనలకు విలువకూడ లేకుండెను. మన యీ స్థితిని జూచి గిడుగు శ్రీరామమూర్తి పంతులు గారివంటి యభిమానులు దీనికిఁ గల మూల ప్రతిబంధకమును గుర్తించి వ్యావహారిక భాషావాదము లేవనెత్తినారు. విరివిగాఁ బ్రచారముకూడ చేసినారు. [illegible]జ్ఞానము గలవారు సహితము వ్యావహారిక భాషలో రచనలు సాగించినారు. దీనితో యువకులకు మంచి ప్రోత్సాహము కల్గినది. ఆంధ్ర భాషాజ్ఞాన మంతగా లేనివారు కూడ తమతమ యమూల్య శాస్త్రజ్ఞానము చేతను, మేధాశక్తి చేతను తెలుఁగునందు ఉత్తమరచనలు గావించినారు. ఎన్నియో దినపత్రికలు, మాసపత్రికలు, సంచికలు బయలుదేరినవి. నవలలకు, నాటకములకుఁ బరిమితి లేకుండఁ బోయినది. ఈ విధముగా మన సాహిత్యము విస్తృతమైనది. వాస్తవమునకు ఈ విషయ మభినందనీయమైనదే. ఈ సూచనయే ప్రజామోదమును బడయనిచో నిజముగా మన సాహిత్యము నేఁటి యీగా యభివృద్ధిస్థితియం దుండి యుండకపోవును. కాని దీనివలనఁ జాలవఱకు నష్టముకూడ కలిగినది. ఇఁక నెప్పటికిని, అన్నిరంగములందును వ్యావహారిక భాషయే యుండవలెనను నభిప్రాయము స్థిరపడిపోయినది. ఇంత యెందుకు? విద్యాలయములందును వ్యావహారిక భాషయే ప్రవేశపెట్టఁ బడవలెనను నంశవఱకును వచ్చినది.

కొన్ని హద్దులున్నవి. ఆ హద్దులను దాటినచో ఆ వస్తువు నిష్ప్రయోజనమై పోవును. నీటికి ప్రవహించుట సహజగుణము. అట్లని మనము ప్రవాహమును సంతతము ప్రవహింప నిచ్చుచునే యున్నామా? దానిని కట్టలుకట్టి, యెన్నొ పంటలు పండించుకొనుచున్నాముగదా! లేనిచో సస్యములు నశ్యములు గావలసిన వేగదా! అట్లే భాషా ప్రవాహమును. గ్రాంథిక భాషలోఁ బెక్కు నియమము లున్నమాట నిజమే. మరి ఛాందసమైన వానిని గొన్నింటిని సడలించిన నేమియు నభ్యంతరము లేదు. ప్రాథమిక సూత్రములకు, క్షతి లేనంతవఱకుఁ బ్రయోజనకారి యయిన ప్రతిమార్పును స్వీకరింప వలసినదే. ఏ కొలఁది మార్పును కూడ సహింపలేనిది నిజముగా సంకుచిత స్వభావమే యనిపించుకొనును. అట్లని మొదలంట మార్పు తేవలయుననుట సమంజసము కాఁజాలదు. కొన్ని భాషలలో, విశేషించి యింగ్లీషు భాషలో 'బేసిక్" అను పేరట భాషను సాధ్యమైనంతవఱకు సులభతరముగాఁ జేయు ప్రయత్నములు జరిగినవి, జరుగుచున్నవి. చాలవఱకు సాఫల్యముకూడ లభించినది. అటువంటి దేదేని ఒక మార్గమును మనముకూడ కనిపెట్టినచో బాగుండును.

పై వాదమువలన నన్నిచోటులను గ్రాంథికభాషా ప్రయోగమే చేయవలెననుట పాడిగాదు. కొన్నికొన్ని యవసరములందు వ్యావహారిక భాషయే మిక్కిలి యుచితముగాను, అనుకూలముగాను నుండును. ఉదాహరణముగా నుపన్యాస వేదికలపైనుండి శుద్ధ గ్రాంథికమున నుపన్యాస[illegible]యఁ దొడఁగినచో నంత రసవంతముగా నుండదు. అట్టి యవసరమున ఆ ప్రాంతమునఁ జెలామణి యగుచున్న వ్యావహారికమునే యుపయోగింపవలెను. దిన పత్రికలందును, తాత్కాలిక ప్రయోజనముగల కరపత్రాదుల యందును, వ్యాసములందును వ్యావహారికమును బ్రయోగించినఁ బ్రయోగింపవచ్చును. కాని మాసపత్రికలందు, నితర సంచికలందును గ్రాంథిక భాషయే తగినట్లుగా నుండును. ఎందుకనఁగా నట్టివాని ముఖ్యోద్దేశ్యము భాషా సేవయే కనుక. ఇఁక నాటికలందు, నేకాంకికలందు నవశ్యముగాఁ దత్తత్ప్రాంత వ్యావహారికమే యుండవలయును. నాటకములలోని పాత్రలు మిక్కిలి సహజముగాను, సంఘములోని వ్యక్తులకుఁ బ్రతిబింబములుగా నుండవలయును గనుక ఆయా పాత్రల వేషభాషలు సామాన్యముగానే యుండవలెను. వారిచే వ్యావహారిక భాషనే మాట్లాడింపవలెను. లేనిచో కృత్రిమములుగాఁ గనుపట్టును, ఇటువంటి మఱికొన్ని ప్రత్యేకావసరములందు వ్యావహారిక ప్రయోగము చేసినఁ జేయవచ్చును. కాని మిగత యన్ని యవసరములందును అవశ్యముగా, విధిగా గ్రాంథికభాషయే యుపయోగింపఁ బడవలెను. అప్పుడే మన భాషకుఁ బ్రతిష్ఠయు, శ్రేయస్సును.

పై యాశయములను గమనించి, సంపాదయితలు, విద్యాసంస్థలు, సారస్వత పరిషత్తులు, విద్యార్థులు, యువకులు, రచయితలు, వారు వీరననేల? ప్రతి భాషా సేవకుఁడును దన మాతృభాషాభివృద్ధికై పాటు పడెదరుగాక! శారదాదేవి వారి యీ సదుద్దేశ్యమును సంపూర్ణముగా సహకరించును గాక!

